# శ్రీ కోదండరామస్వామి ఆలయం
# తిరుపతి


రచన
జూలకంటి బాలసుబ్రహ్మణ్యం
తిరుపతి






ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు తిరుపతి
**2014**

SRI KODANDARAMASWAMY AALAYAM - Tirupati

By
Julakanti Balasubrahmanyam

T.T.D. Religious Publications Series No.996



First Edition : 2013
Re-print : 2014

Copies: 3000

*Published by :*
**M.G. GOPAL**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Office of the Editor-in-Chief,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

# ముందుమాట

**ఆపదామపహర్తారం**
**దాతారం సర్వసంపదామ్**
**లోకాభిరామం శ్రీరామం**
**భూయో భూయో నమామ్యహమ్**

తిరుమల తిరుపతి దేవస్థానంవారి పర్యవేక్షణలో శ్రీరాముని ఆలయాలు రెండు ఉన్నాయి.

ఒకటి తిరుపతిలోని శ్రీకోదండరామస్వామివారి ఆలయం. రెండవది వాయల్పాడు అని పిలువబడే వాల్మీకిపురంలోని శ్రీపట్టాభిరామస్వామి ఆలయం. ఈ రెండు ఆలయాల్లోని శ్రీరామచంద్రుని మూలమూర్తులు జాంబవంతులవారి ప్రతిష్ఠగా ప్రాచీన కాలంనుంచీ చెప్పబడుతూ వున్నాయి.

వేంకటాచలక్షేత్రానికి, శ్రీరామచంద్రునికి చాల దగ్గరి సంబంధం వుంది. ప్రతిరోజు శ్రీవేంకటాచలపతి "కౌసల్యా సుప్రజా రామ..." అని సుప్రభాతవేళ మేల్కొల్పులు పాడించుకుంటున్నాడు. తిరుపతి శ్రీకోదండరామస్వామివారి ఆలయంలో కూడ తిరుమల శ్రీవారి సుప్రభాత స్తోత్రమే పఠింపబడుతుండడం గమనించవలసిన ప్రత్యేక అంశం. అంతేకాదు తిరుమల శ్రీవారి ఆలయంలో ప్రత్యేకంగా 'రాములవారి మేడ' అనే 'అర' చోటుచేసుకోవడమే గాక అందులో శ్రీసీతాలక్ష్మణహనుమత్సమేత శ్రీకోదండరాముని పంచలోహ మూర్తులు కూడ కొలువై ఉండడం గమనించవలసిన అంశం.

దేవస్థానంలోని అన్ని ఆలయాల స్థలపురాణాలను, ఆలయవిశేషాలను, సేవలను సంక్షిప్తంగా భక్తులకు తెలియచేయాలని. తి.తి.దేవస్థానం సంకల్పించింది. అందులో భాగంగా కల్యాణరామునిగా, ఇష్టార్థరామునిగా

భక్తలోకంలో ప్రతీతి నందిన తిరుపతి శ్రీ కోదండ రామస్వామివారి ఆలయ స్థలపురాణాన్ని, సేవలను సంక్షిప్తంగా తి.తి.దేవస్థానం అందజేస్తున్నది. ఈ గ్రంథాన్ని రచించిన శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారికి శ్రీసీతాలక్ష్మణ హనుమత్సమేత శ్రీకోదండరాముని అనుగ్రహం నిండుగా వుండాలని ఆకాంక్షిస్తున్నాం.

ప్రస్తుతం (2013 మార్చిలో) జరుగుతున్న తిరుపతి శ్రీ కోదండ రామస్వామివారి వార్షికబ్రహ్మోత్సవాల సందర్భంగా ఈ పుస్తకాన్ని భక్తలోకానికి అందిస్తున్నాం. ఈ గ్రంథాన్ని చదివి భక్తులు శ్రీ కోదండ రామస్వామివారి అనుగ్రహానికి పాత్రులు కాగలరని ఆశిస్తూ...

సదా శ్రీవారి సేవలో....

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# కృతజ్ఞతాంజలి

రెండేండ్లుగా, అంటే 2011 వ సంవత్సరం నుండి తిరుమల తిరుపతి దేవస్థానం పర్యవేక్షణలోని దేవాలయాల చరిత్రల్లో ఒక సువర్ణాధ్యాయం ప్రారంభమైంది.

దేవస్థానం ఆలయాలను అభివృద్ధి పరచడంలోను, ఆ యా ఆలయాల్లో బ్రహ్మోత్సవం వంటి విశేషోత్సవాలను వినూత్నంగా నిర్వహించడంలోను, ఆ ఉత్సవాల్లో నూతన వస్త్రసమర్పణ, పుష్పమాలాసమర్పణవంటి కార్యక్రమాల్లోను సామాన్య భక్తులందరూ పాలుపంచుకొనేట్లుగా వీలు కల్పించడంవంటి నిర్ణయాలు గైకొనడంలోను నిరంతర భక్తజన సేవా తత్పరులు, సంగీత సాహిత్యజ్ఞులు, సహృదయులైన తి.తి.దేవస్థానం శ్రీ కార్యనిర్వహణాధికారి శ్రీ.ఎల్.వి. సుబ్రహ్మణ్యంగారు, సంగీత సాహిత్యాభిలాషులు, భక్తజనసేవాతత్పరులు, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ.పి.వెంకటరామిరెడ్డి గారలు అమలు చేస్తున్న చర్యలు చాల గొప్పవి. అవి భక్తులపాలిటి వరాలు.

ముఖ్యంగా తిరుపతి శ్రీకోదండరామస్వామివారి బ్రహ్మోత్సవాలను ఘనంగా అంగరంగవైభవంగా నిర్వహించడంతోపాటు, ఆ పదినాళ్లపాటు శ్రీసీతారాములకు నూతన వస్త్ర సమర్పణ కైంకర్యంలోను, 'శ్రీరామకోటి' నామ లిఖిత మహాయజ్ఞంలోను భక్తులందరూ తరతమ భేదం లేకుండా, పాలు పంచుకోనేట్లుగా అవకాశం కల్పించడం అద్భుతమైన కార్యం, ఆనందించ వలసిన కార్యక్రమం.

అంతమాత్రమే గాక ఆ యా ఆలయాల చరిత్రలను స్థలపురాణాలను, ఉత్సవవిశేషాలను వీలైనంత సంక్షిప్తంగా భక్తులకు అందజేయాలన్న సంకల్పంతో, తి.తి.దేవస్థానం తిరుపతి శ్రీకోదండరామస్వామి ఆలయాన్ని గూర్చి నన్ను వ్రాయమని ఆదేశించడం తిరుమలేశుని అనుగ్రహంగా

భావిస్తున్నాను. ప్రస్తుతం తిరుపతిలోని 'శ్రీ కోదండ రామస్వామి' ఆలయం స్థలపురాణాన్ని, ఆలయ విశేషాలను పుస్తకరూపంలో అందజేయడం నా మహద్భాగ్యం. నా యీ రచనలో ఎన్నో విషయాల్ని తెలిపిన శ్రీకోదండరామ స్వామి ఆలయ అర్చకవరేణ్యులయిన శ్రీమాన్ అర్చకం పట్టు ఆనందకుమార్ దీక్షితులవారికి భక్తిపూర్వక నమస్కారాలు.

నా యీ రచనలు అన్నింటికీ కర్తా, కారయితా భగవానుడైన తిరుమల వేంకటేశ్వరుడు! కాగా, ప్రేరకులు, ఆమోదకులు మాత్రం దేవస్థానం ఇ.ఓ శ్రీ లంక వెంకటసుబ్రహ్మణ్యంగారు, జే.ఇ.ఓ. శ్రీ.పి.వెంకటరామిరెడ్డి గారలు. వీరిద్దరూ 'వేంకట' నామధేయులు మాత్రమే కాక తిరుమల శ్రీవేంకటేశ్వరుని సాక్షాత్ ప్రతినిధులు కూడ. వారందరికీ భక్తిపూర్వక ప్రణామాంజలులు.

ఈ రచనలు చెయ్యడానికి వెన్నుతట్టి ఉత్సాహపరుస్తున్న తి.తి.దేవస్థానం ఎడిటర్-ఇన్-ఛీఫ్ ఆచార్య రవ్వా శ్రీహరి గారికి, పుస్తకముద్రణలో ప్రత్యేక శ్రద్ధ చూపించిన దేవస్థానం పి.ఆర్.ఓ. శ్రీ టి.రవి గారికి, పుస్తకాన్ని ముచ్చటైన రంగుల అట్టతో చూడసొంపుగా ముద్రించిన దేవస్థానం ప్రెస్సు మేనేజరు శ్రీ వి.సాంబశివరావు గారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

తి.తి.దేవస్థానంలోని ఇతర ఆలయాల చరిత్రరచనలు కూడ ఘనవేంకటేశుని అనుగ్రహంతో, సహృదయులైన అధికారుల ప్రోత్సాహంతో కొనసాగగలవని ఆకాంక్షిస్తున్నాను.

**ఓం నమో వేంకటేశాయ**

**రచయిత**
**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**
**తిరుపతి.**

# విషయసూచిక

# శ్రీకోదండరామస్వామి ఆలయం - తిరుపతి

**సీతాయా వామభాగే చ**
**లక్ష్మణస్య చ దక్షిణే**
**తన్మధ్యే రాఘవం వందే**
**ధనుర్బాణధరం హరిమ్.**

దివ్యమైన భవ్యమైన తిరుపతి పట్టణం నడుమభాగాన ఇష్టార్థులపాలిటి పెన్నిధిగా వెలసిన పరమపావనమైన దివ్య ఆలయం శ్రీకోదండరామస్వామి ఆలయం!

ఈ దేవాలయంలోని గర్భగృహంలో స్థానక భంగిమ (నిలుచున్న) లో దర్శనమిస్తున్న కల్యాణరాముడు శ్రీకోదండరాముడు! కుడివైపున సాక్షాత్తు శ్రీమహాలహక్ష్మీ స్వరూపురాలైన సీతాదేవి! మరోప్రక్కన అనగా ఎడమవైపున శ్రీలక్ష్మణస్వామి వేంచేసివుండగా వీరిరువురి మధ్యలో ధనుర్బాణాలతో విరాజిల్లుతూవున్న సాక్షాతు శ్రీమన్నారాయణుడైన శ్రీరఘురామునికి నమస్కారాలు.

స్థానక (నిలుచున్న) భంగిమలో ఆనందంగా దర్శనమిస్తు భక్తులను ఆనందపరుస్తున్న శ్రీరామచంద్రమూర్తి!

ఇంకెక్కడా కానరాని సుందర దృశ్యం!

శ్రీరామచంద్రమూర్తికి కుడివైపున కొలువైవున్న సీతమ్మవారి దర్శనం సర్వ శ్రేయోదాయకం! సర్వార్థ సిద్ధిప్రదం!

పరమ రామభక్తుడైన జాంబవంతుడు ప్రతిష్ఠించిన దేవుడు తిరుపతి కోదండరాముడు. కోటివిధాలుగా కోరికలను తీరుస్తున్న ఇష్టార్థరామునిగా భక్తలోకంలో ప్రసిద్ధిని పొందివున్నాడు.

తిరుపతిలోని శ్రీకోదండరాముని దర్శిస్తే చాలు!

శ్రీమద్రామాయణంలోని శ్రీ సీతారాములకల్యాణఘట్టం స్ఫురించి మనస్సు పులకిస్తుంది.

మిథిలానగరంలో కల్యాణం జరుగుతున్న శుభప్రదమైన వేళ! ఒక సన్నివేశంలో శ్రీరామునికి కుడిప్రక్కన సీతమ్మవారిని నిలబెట్టి పురోహితులు వివాహతంతును జరిపించే ఘట్టం స్ఫురిస్తుంది. కుడివైపున పెండ్లికూతురు సీతతోను, ఎడమవైపున తోడిపెండ్లికొడుకు లక్ష్మణునితోను దర్శనమిస్తున్న కల్యాణరాముడు తిరుపతి శ్రీకోదండరాముడు!

## స్థలపురాణం

తిరుమలక్షేత్రంలోని, శ్రీనివాసభగవానునికీ, శ్రీరామచంద్రునికీ యుగయుగాలుగా విడదీయలేని, విడదీయగరాని ఒక అవినాభావ సంబంధం చోటు చేసుకొంది.

అటు శ్రీరాముడికి ఇటు వేంకటపతికివున్న బంధాన్ని అనుబంధాన్ని పరిశీలిస్తే చాలు! అదే తిరుపతి శ్రీకోదండరాముని దివ్యసన్నిధికి సంబంధించిన పరమపావనమైన స్థలపురాణం అవుతుంది.

ఇక్కడ ఒక అద్భుతమైన మాట!

ఈ వేంకటపతి ఇచ్చిన వరంవల్లే శ్రీరాముడు అవతరించాడు!

ఆశ్చర్యంగా ఉంది కదూ! ఎంత అబ్బురమైనా ఈ మాట మాత్రం నిజం!



వేంకటపతి వరం ఎవరి కిచ్చాడు? ఎప్పుడిచ్చాడు? ఎప్పటి శ్రీరామ చంద్రుడు! మరెప్పటి వేంకటాచలపతి! మరి ఆ వైనమేమిటో చెప్పుకుందాం.

## దేవతలు విష్ణువును వెదకడం

ఇది త్రేతాయుగం నాటి మాట!

అప్పట్లో రావణ కుంభకర్ణులు పెడుతున్నబాధలవల్ల లోకాలు అన్నీ తల్లడిల్లాయి. వారు పెట్టేబాధలు అన్నీ ఇన్నీ కాదు. ఒకటా! రెండా! ఒక లోకంలోనా! ఏమన్నానా. అటు భూలోకం, ఇటు స్వర్గ లోకం. ఈ మధ్యలో ఎన్నిచోట్లో! ఇలా అన్ని లోకాల్లోను వారి ఆగడాలు మితిమీరినందువల్ల ఒక్కుమ్మడిగా బ్రహ్మాది దేవతలు, ఋషులు అందరూ కలిసి వైకుంఠానికి వెళ్ళారు.

ఆ వైకుంఠంలో శ్రీమన్నారాయణుడు ఉంటేగా చెప్పుకోవడానికి! ఎక్కడికో వెళ్లాడు. ఎక్కడికి వెళ్లాడో ఎవరికీ తెలియదు. దేవతలందరూ దివ్యదృష్టితో పరికించి చూచారు. వెదికి వెదికి వేసారినారు. తప్ప ఎక్కడా ఏ లోకంలోనూ శ్రీనివాసభగవానుని జాడే కన్పడలేదు పాపం! దిగాలుమన్నారు దేవతాపరివారమంతా! కాని వాళ్లందరి అదృష్టం బాగున్నట్లుంది.

ఇంతలో వాళ్లకు నారదుడు కన్పడ్డాడు.

నారదమహర్షీ ! ఈ బాధలనుంచి గట్టెక్కే ఉపాయం చెప్పండి అంటూ ప్రార్థిస్తూ వాళ్లందరూ లోకాలన్నింటి బాధలను వెళ్లబోసుకొన్నారు.

నారాయణ! నారాయణ! అంటూ తలను ఆడిస్తూ నారదుడు ఇలా అన్నాడు.

ఓ మహనీయులారా! ప్రస్తుతం ఈ వైకుంఠంలో శ్రీమహావిష్ణువు లేదు. మీరు అందరూ భూలోకం వెళ్లండి. అక్కడ వేంకటాచలం అనే దివ్యమైన

భవ్యమైన క్షేత్రం ఉంది. ఆ పుణ్యగిరులలో సాక్షాత్తు వైకుంఠవాసుడు లీలా మానుషరూపుడై సంచరిస్తున్నాడు. అక్కడికి వెళ్లి, మీరు అందరూ, ఎవరికి తోచినట్లుగా వారు తపస్సులు చెయ్యండి! అలా సాధనలు చేస్తూ ఓపికతో నిరీక్షించండి. అప్పుడు మీకు ఆ స్వామివారు దర్శనం ఇవ్వవచ్చు. అంతే. నారాయణ! నారాయణ! అంటూ తన దారిన తాను వెళ్లాడు మహర్షి నారదుడు.

అందరూ వేంకటాచలక్షేత్రం చేరుకున్నారు.

**శ్లో॥శ్రీ శ్రీనివాసః పరదైవతం నః**
**శ్రీ శ్రీనివాసః పరమం ధనం నః**
**శ్రీ శ్రీనివాసః కులదైవతం నః**
**శ్రీ శ్రీనివాసః పరమాగతి ర్నః**

శ్రీనివాసుడు ఒక్కడే మాకు పరదైవతం! శ్రీనివాస ప్రభువు ఒక్కడే మాకు పరమధనం! శ్రీనివాస భగవానుడు ఒక్కడే మాకు కులదైవతం! శ్రీనివాస పరంధాముడు ఒక్కడే మాకు పరమగతి!! వేరే దిక్కు లేనే లేదు" అంటూ కొందరు ప్రార్థించారు.

**శ్లో॥వృషశైలాధిప ఏవ దైవతం నః**
**వృషభాద్రీశ్వర ఏవ దైవతం నః**
**ఫణిశైలాధిప ఏవ దైవతం నః**
**భగవాన్ వేంకట ఏవ దైవతం నః**

వృషశైలాధిపుడు ఒక్కడే మా దేవుడు! వృషభాద్రీశ్వరుడు ఒక్కడే మా దేవుడు! ఫణిశైలాధిపతి ఒక్కడే మాకు దేవుడు. వేంకట భగవానుడు ఒక్కడే మా దేవదేవుడు – అంటూ మరికొందరు స్తుతించారు.

ఇలా శ్రీనివాసభగవానుని దర్శనం కోసం నిరీక్షిస్తూ ప్రార్థిస్తూ ఎవరికి వారు తమకు నచ్చిన విధంగా తపస్సులు ప్రారంభించారు.....



## దశరథుని వేంకటాచలయాత్ర

సరిగ్గా అయోధ్యానగరాన్ని దశరథచక్రవర్తి పాలిస్తున్న రోజులు అవి! దశరథుడంటే కేవలం అయోధ్యకు మాత్రమే రాజు కాదు. కేవలం అష్టదిక్కుల్లోనే గాక, అటు ఊర్ధ్వలోకాల్లోను ఇటు అధోలోకాల్లోను, రథాన్ని నడిపించగల సార్థక నామధేయుడు దశరథుడు. ఇలా స్వేచ్ఛగా అన్నిలోకాల్లో రథాన్ని నడపించగల చక్రవర్తి! దేవదానవయుద్ధాల్లో దేవతలకు విజయాన్ని చేకూర్చిపెట్టి ఎన్నో వరాల్ని కూడా పొందిన మహావీరుడుకూడా!

ఇలా 60 వేలఏండ్లపాటు రాజ్యాన్ని సర్వశోభాయమానంగా పాలించాడు. కాని అంతటి చక్రవర్తికీ ఒక కొరత ఉంది!

అసలు ఏమాత్రం కొరతే లేని మానవుడు ఉంటాడా లోకంలో!

మహాచక్రవర్తి దశరథునికి కూడ ఎంత కాలానికి సంతానం కలగలేదన్న తీరని బాధ కలిగింది. తన వేదనను గురువు వశిష్ఠులవారికి పరి పరి విధాల విన్నవిస్తూ పరితపించి పోయాడు.

వశిష్ఠగురువర్యా! మా ఇక్ష్వాకువంశానికి ఎంతోకాలంనుంచీ గురుపీఠ మలంకరించినవారు మాత్రమేగాక, మా హితం కోరే పురోహితులు కూడా మీరే కదా!

నాకు ఈ జన్మలో సంతానప్రాప్తి ఉందా?

పున్నామనరకాన్ని పోగొట్టే పుత్రుడు పుడతాడా?

నా వారసునిగా ఈ రాజ్యాన్ని పాలించగల రఘుకులప్రదీపకుడు జన్మిస్తాడా? – అంటూ సందేహ పరంపరల్ని గుప్పిస్తూ

పరిష్కారమార్గం చెప్పండి అంటూ నిరాశానిస్పృహలకు లోనై కృంగి పోయాడు దశరథమహారాజు.

వశిష్ఠమహర్షివరేణ్యులు పరి పరి విధాలుగా ఆలోచించి ఆలోచించి చక్రవర్తీ! ఏ మాత్రం చింతించ వద్దు. దీనికి పరిష్కారమార్గం ఒక్కటి మాత్రమే కనపడుతూ ఉంది.

వింధ్యపర్వతానికి ఆవల సువర్ణముఖరీనదీ తీరంలో వేంకటాచలక్షేత్రం ఉంది. ఆ సప్తగిరుల దివ్యసానువుల్లో సాక్షాత్తు వైకుంఠవాసుడు శ్రీమహాలక్ష్మీ సమేతంగా లీలామానుషరూపంతో విహరిస్తుంటాడు. కేవలం తపస్సంపన్నులకూ పరమయోగులకు, సాధకులకు మాత్రమే ప్రత్యక్షంగా దర్శనమిస్తాడు. కోరిన వరాలను ప్రసాదిస్తాడు. మిగిలినవేళల్లో అదృశ్యంగా ఉంటాడు. ఎవరికీ సాధారణంగా కనపడడు.

మహారాజా! అలాంటి దివ్యమైన వేంకటగిరులకు వెంటనే యాత్రగా వెళ్లు! అచటవున్న పరమపావనమైన స్వామిపుష్కరిణీ తీర్థజలాల్లో స్నానం చేస్తూ, కొంతకాలంపాటు పుత్రార్థివై సాధన చెయ్యి. నీ కోరిక తప్పక నెరవేరుతుంది. ఇంతకంటె మరో మార్గం లేదు. తప్పక నీ కోరిక సిద్ధించుగాక! నీవు వేంకటాచలం వెళ్లిరా! అంటు ఆశీర్వదించి పంపాడు వశిష్ఠమహర్షి.

గురువుగారి ఆదేశంపై సంతానార్థియైన దశరథుడు వేంకటాచలక్షేత్రం చేరుకొన్నాడు.

ఆ పర్వతసానువులు పచ్చని చెట్లతో, పూ పొదరిళ్లతో, పరిమళ ఝురులతో అందంగా ఆకర్షణీయంగా గోచరించాయి. ఎక్కడ చూచినా తామర కొలనులు. ఆ కొలనులపై తిరుగాడే తుమ్మెదలతో నేత్రపర్వంగా, రమ్యమైన ప్రకృతి సౌందర్యంతో ఆహ్లాదంగా ఆ పర్వతం దర్శనమిచ్చింది. ఎక్కడ చూచినా పనస, అరటి చెట్లు. ఎన్నో మృగాలకు, పక్షి సంతతులకు నిలయమైన కొండను చూచిన దశరథుడు వింత అనుభూతికి లోనయ్యాడు. వీటిన్నిటితోపాటు సర్వత్రా ఒక ఆధ్యాత్మిక చైతన్యంతో ప్రకాశిస్తున్న ఆ



పర్వతరాజాన్ని వీక్షిస్తూ దివ్యానందంతో పులకించిపోయాడు అయోధ్యా చక్రవర్తి! దశరథమహారాజు.

అప్పటికే ఆ పుణ్యప్రదేశాల్లో బ్రహ్మేంద్రాది దేవతలు, అనేకమంది మునులు, యోగులు, .. ఇలా ఎందరో తపస్సు చేస్తుండడం చూచి ఆశ్చర్యపోయాడు దశరథుడు. వీరికి కూడా కోరికలున్నాయా! ఇలాంటి దేవతలకు కూడా వరాలను ప్రసాదించగల పరంధాముని అనుగ్రహంకోసం వీళ్లంతా నిరీక్షిస్తున్నారా! ఆశ్చర్యంగా వుందే! అని ఆనందపడుతూ ఈ దేవతల దర్శనంతోపాటు వీరందరి తపస్సుల వల్ల ఆ వైకుంఠనాథుని దర్శన భాగ్యం తనకు ప్రాప్తించవచ్చు కదా! తద్వారా పుత్రులు కావాలన్న తన కోరిక కూడా నెరవేరవచ్చు కదా అని తనలో పరిపరివిధాలుగా ఆలోచిస్తూ సంతోషించి తానూ తపస్సును ప్రారంభించాడు. ఇలా కొంతకాలం గడిచింది.

ఒక రోజు శుభోదయవేళ! అందరికీ ఆశ్చర్యం కలిగేట్లుగా 'ఓం' అనే గంభీరమైన నాదం పెద్దగా వినపడుతుండగా దివ్యతేజస్సుతో కూడిన అద్భుతమైన బంగారువిమానం ప్రత్యక్షమయింది. ఆ విమానం అనేక శిఖరాలను కలిగి ఉంది.

ఇంకా అనేకమైన రత్నాలతో పొదగబడి ప్రకాశిస్తోంది. చక్కగా వేలాడుతున్న ముత్యాలహారాలతో ఆ విమానం శోభాయమానంగా అలంకరింపబడింది. ఆ విమానం చూడడానికి రెండు కన్నులు చాలవు. దాన్ని చూచే కొద్దీ ఆనందం పెరుగుతున్నదే తప్ప తృప్తి కలగడం లేదు.

ఇలాంటి అద్భుతమైన అందమైన బంగారువిమానాన్ని ఇంతవరకు ఈ పర్వతసానువుల్లో ఎవరూ చూడలేదు. చూచివుండరు కూడ. వింత వింత తేజస్సులతో ప్రకాశిస్తున్న ఆ విమానం అంతర్భాగమధ్యలో పురుషోత్తముడైన భగవానుడు దర్శనమిచ్చాడు. శంఖచక్రాలు ధరించాడు.

ఇంకా నందకఖడ్గంతో పాటు గదను, ధనుస్సును ధరించాడు. ఈ పంచాయుధాలతో పాటు అనేకమైన దివ్యాభరణాలను రత్నకిరీటాన్ని ధరించాడు. వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మిదేవితో పాటు భూనీళాదేవులతోపాటు కన్నులపండువుగా దేదీప్యమానంగా దర్శనమిచ్చాడు పరంధాముడు.

అందరూ వారి వారి రీతుల్లో స్తుతించారు, గానం చేశారు. నృత్యంచేశారు. వాద్యాలను మోగించారు. ఇలాగ అనేకవిధాలుగా శ్రీనివాస భగవానుని ప్రార్థించారు. రావణకుంభకర్ణాదులవల్ల కలుగుతున్న బాధలను ఏకరువు పెడుతూ, వాళ్ల నుండి లోకాలను రక్షించవలసిందని అనేక విధాలుగా ప్రాధేయపడుతూ స్వామివారిని స్తుతించారు బ్రహ్మాదిదేవతలు.

ఈ సందర్భంలోనే దశరథమహారాజుకూడా శ్రీనివాసుని కన్నులారా దర్శించి ఆనందిస్తూ తనకు సంతానాన్ని ప్రసాదించవలసిందని వేడుకొన్నాడు. శ్రీహరి అందరివైపు కరుణతో నిండిన చూపులతో వీక్షిస్తూ, ప్రత్యేకంగా దశరథునితో ఇలా అన్నాడు.

"రాజా! నీవు అయోధ్యానగరానికి వెళ్లు. సంతానం కోసం "పుత్రకామేష్టి" అనే యాగం నిర్వహించు. ఆ యజ్ఞనిర్వహణవల్ల నాకు సాటి రాగల నలుగురు పుత్రులు నీకు కలుగుతారు" వెంటనే బయలుదేరు. నేను వరం ఇస్తున్నాను. అభీష్ట సిద్ధిరస్తు! అని దశరథుణ్ణి సాగనంపాడు.

## రాముడే పరబ్రహ్మ!

ఆ తర్వాత విష్ణుభగవానుడు అక్కడవున్న దేవతలతో ఇలా అన్నాడు. నేను దశరథునికి ఇచ్చిన వరంవల్ల మీ కోరికలు కూడా ఒకేసారి తీరినట్లయ్యాయి. నేను దశరథునికి పుత్రునిగా శ్రీరాముడనే పేరుతో పుత్రునిగా అవతరించి రావణ కుంభకర్ణులతో పాటు అనేక రక్కసి మూకలను సంహరిస్తాను.



రావణ కుంభకర్ణులకు మానవులవల్ల మాత్రమే మరణం తథ్యం. అందువల్ల పురుషోత్తముడైన మానవునిగా అవతరించి వారిని సంహరిస్తాను. నిశ్చింతగా మీ మీ లోకాలకు వెళ్లండి. మీ మీ కార్యక్రమాల్లో నిమగ్నులుకండి అంటూ స్వామి అదృశ్యమయ్యాడు.

వశిష్ఠమహర్షి ఆచార్యకత్వంలో పుత్రకామేష్టి యాగం చేసిన దశరథ మహారాజుకు నలుగురు కొడుకులు పుట్టారు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు శ్రీరామునిగా, ఆదిశేషుని అంశతో లక్ష్మణుడు, శంఖ, చక్రాంశలతో భరత శత్రుఘ్నులు అవతరించారు.

సాక్షాత్తు వేంకటాచలపతి ఇచ్చిన వరం వల్లే శ్రీరాముడు అవతరించాడని శ్రీవేంకటాచలమాహాత్మ్యం స్పష్టం చేస్తోంది. అంతేగాక ఆ రాముడే నేను, నేను ఆ రాముణ్ణి అంటూ వేంకటేశ్వరుడు అడుగడుగునా స్ఫురింపజేస్తూనే ఉన్నాడు.

ప్రతిరోజు తిరుమల క్షేత్రంలో శ్రీనివాస భగవానునికి ఉదయంపూట సహస్రనామార్చన జరుగుతుంది. అందులో తనకు, శ్రీరామునికి భేదం ఏమాత్రం లేదు, తానే శ్రీరాముణ్ణి, శ్రీరాముడే తాను అంటూ శ్రీరాముని నామాలతో అర్చనలందుకుంటున్నాడు వేంకటేశ్వరుడు.

**ఓం రాఘవాయ నమః**
**ఓం కౌసల్యాతనయాయ నమః**
**ఓం విశ్వామిత్ర ప్రియంకరాయ నమః**
**ఓం సుబాహుఘ్నాయ నమః**
**ఓం అహల్యాశాపవిచ్ఛేదినే నమః**
**ఓం జనకాధీశ సంస్తుతాయ నమః**
**ఓం వల్కల ధారకాయ నమః**
**ఓం భరతాగ్రజాయ నమః**
**ఓం రామాయ నమః**
**ఓం తాటకారయే నమ**
**ఓం బలాతిబలమంత్రవతే నమః**
**ఓం జానకీపరిణేత్రే నమః**
**ఓం శూర్పణఖానాసాచ్ఛేత్రే నమః**
**ఓం దశకంఠశిరోధ్వంసినే నమః**
**ఓం జాంబవత్ప్రముఖా వృతాయ నమః**

వంటి శ్రీరాముని నామాలతో అర్చింపబడుతున్నాడు తిరుమలేశుడు. అందువల్లే ఆదిత్యపురాణాంతర్గత శ్రీవేంకటాచలమాహాత్మ్యంలో

**శ్రీరామ దశ దిగ్వ్యాప్తం**
**దశేంద్రియ నియామకం**
**దశాస్యఘ్నం దాశరథిం**
**శ్రీనివాసం భజేఽనిశమ్**

అంటూ స్తుతింపబడింది.

పది దిక్కుల్లో వ్యాపించివున్నవాడూ, దశేంద్రియాలను శాసించేవాడూ, దశముఖుడైన రావణుని సంహరించినవాడూ, దశరథుని కుమారుడూ అయిన శ్రీరామచంద్రుణ్ణి శ్రీనివాసప్రభువుగా ఎల్లప్పుడూ భజిస్తాను.

అందుకే ఒకానొక సందర్భంలో ఆంజనేయస్వామి అంగదునితో ఇలా అంటాడు.

**శ్లో॥ రామో నమానుషో దేవః**
**సాక్షాన్నారాయణోఽవ్యయః**
**సీతా భగవతీ మాయా జనసమ్మోహకారిణీ**
**లక్ష్మణో భువనాధారః సాక్షాచ్ఛేషః ఫణీశ్వరః**
**బ్రహ్మణా ప్రార్థితాః సర్వే రక్షోగణ వినాశనే**
**మాయా మానుష భావేన జాతా లోకైకరక్షకాః**

అంటూ అంగదునితో శ్రీసీతాలక్ష్మణ సమేత శ్రీరాముణ్ణి గూర్చి ఇలా అంటాడు.

అంగదా! మనం చూస్తున్న ఈ శ్రీ సీతారామలక్ష్మణులు ఎవరనుకున్నావు? శ్రీరాముడు మానవుడు కాడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు! పూజ్యురాలైన సీతామాత అందరినీ మోహింపజేసే మాయ. ఆమే భగవతి అయిన లక్ష్మీదేవి! లక్ష్మణస్వామి సర్వభూభారాన్ని మోసేటటువంటి ఆదిశేషుడు! వీళ్లంతా



రాక్షసవినాశం కోసం బ్రహ్మదేవుడు ప్రార్థించడం చేత ఇలా అవతరించారు. మానవరూపాల్లో సంచరిస్తున్నారు అంటూ తెలియజేశాడు.

ఒకానొక సందర్భంలో పరమేశ్వరుడు శ్రీరామచంద్రుణ్ణి ఇలా స్తుతించాడు.

**శ్లో॥ త్వమాది మధ్యాంత విహీన ఏకః**
**సృజస్య వస్యత్సి చ లోకజాతమ్**
**స్వమాయయా తేన లిప్యసే త్వం**
**యత్స్వే సుఖేఽజస్రతోఽనవద్యః**

– అధ్యాత్మరామాయణం

శ్రీరామా! సీతామనోభిరామా! నీవు ఆదిమధ్యాంత రహితుడివయ్యా! నీవు నీ మాయచేత సమస్తలోకాల్లోని సర్వచరాచరాన్ని సృష్టిస్తుంటావు. రక్షిస్తుంటావు. చివరకు సంహరిస్తుంటావు కూడ! ఇన్ని కార్యాలు చేస్తున్నా నీవు నిస్సంగత్వంతో వుంటావు. నీలో నీవే ఎల్లప్పుడు రమిస్తూ ఆత్మసుఖంతో విరాజిల్లుతూ వుంటావు కదా – అంటూ పరమశివుడు సాక్షాత్తు పరబ్రహ్మ మూర్తిగా శ్రీరాముణ్ణి కీర్తిస్తాడు. ఇంకా

**శ్లో॥ అహం భవన్నామ గృణన్ కృతార్థో**
**వసామి కాశ్యామనిశం భవాన్యా**
**ముమూర్ష మాణస్య విముక్తయేఽహం**
**దిశామి మంత్రం తవ రామ నామ**

– అధ్యాత్మరామాయణం

'శ్రీరామా! దివ్యక్షేత్రమైన కాశీపట్టణంలో పార్వతితో కలిసి నేను "శ్రీరామ శ్రీరామ" – అంటూ నీ నామాన్ని అహరహం జపిస్తూ కృతార్థుణ్ణి అవుతున్నాను. భక్తుల ప్రాణప్రయాణ సమయంలో ముక్తికోసం వారిచెవుల్లో రామ మంత్రాన్ని ఉపదేశిస్తుంటాను." అని శ్రీరాముణ్ణి కీర్తించాడు.

శ్రీవేంకటేశ్వరుని ఆంతరంగిక భక్తుడూ, నందకాంశ సంభూతుడూ అయిన తాళ్లపాక అన్నమాచార్యులు అనేక వందల పదకవితల్లో శ్రీవేంకటేశ్వర స్వామికి, శ్రీరామునికి అభేదం చెప్తాడు. ఇద్దరూ ఒక్కటే అంటాడు.

**బౌళిరామక్రియ**

**ఇతఁడే పరబ్రహ్మ మిదియె రామకథ**
**శతకోటివిస్తరము సర్వపుణ్యఫలము** ॥పల్లవి॥

**ధరలో రాముఁడు పుట్టె ధరణిజఁ బెండ్లాడె**
**అరణ్యవాసుల కెల్లా నభయ మిచ్చె**
**సొరిది ముక్కులఁ జెవులు చుప్పనాతిని గోసె**
**ఖరదూషణులను ఖండించి వేసె** ॥ఇతఁడే॥

**కినిసి వాలిఁజంపి కిష్కింధ సుగ్రీవు కిచ్చె**
**వనధి బంధించి దాఁటె వానరులతో**
**కనలి రావణ కుంభకర్ణాదులను జంపి**
**వనితఁ జేకొని మళ్లి వచ్చె నయోధ్యకును** ॥ఇతఁడే॥

**సౌమిత్రియు భరతుఁడు శత్రుఘ్నుఁడు గొలువఁగ**
**భూమి యేలె కుశలవపుత్రుల గాంచె**
**శ్రీమంతుఁడై నిలిచె శ్రీవేంకటాద్రిమీఁద**
**కామించి విభీషణు లంకకుఁ బట్టము గట్టె** ॥ఇతఁడే॥

– అన్నమాచార్యులు

ఇలాగ శ్రీరాముడు మానవుడు కాదు. సాక్షాత్తు పరబ్రహ్మ. ఆయనే ఈ వేంకటాద్రిపై శ్రీనివాసునిగా వెలసివున్నాడని కీర్తిస్తాడు అన్నమయ్య.



అంతేకాదు. ఆ తర్వాతికాలంలో జడధారులైన శ్రీరామలక్ష్మణులు అరణ్యవాస సమయంలో సీతాన్వేషణ చేస్తూ ఈ వేంకటాచలక్షేత్రానికి వచ్చారు. అందుకు గుర్తుగా శ్రీ సీతారామలక్ష్మణస్వాములవారి విగ్రహ మూర్తులు తిరుమల శ్రీవారిఆలయంలో కొలువై వున్నాయని అంటారు. కనుకనే ఈ శ్రీ సీతారామలక్ష్మణుల విగ్రహమూర్తులు కిరీటాలు లేకుండా కేవలం జడధారులుగానే దర్శన మిస్తుండడం గమనించవలసిన విశేషం!

భగవద్రామానుజులవారు తమగురువైన తిరుమలనంబిదగ్గర వేంకటాచలక్షేత్రం మూలంలో అనగా అలిపిరిలో (తిరుపతి నుంచి తిరుమలకు నడిచివెళ్లే మార్గంలో) శ్రీమద్రామాయణరహస్యాలను అధ్యయనం చేస్తూ వుండినారు. ఆ సమయంలో ఒక విప్రుడు వారి వద్దకు వచ్చి శ్రీ సీతారామ లక్ష్మణ విగ్రహాలను సమర్పించినట్లు ప్రతీతి!

ఆ విగ్రహమూర్తులే ఆనందనిలయంలో చేరినట్లుగా ఐతిహ్యం! ప్రత్యేకంగా ఈ విగ్రహాలు ఉన్న అర "రాములవారి మేడ" అని పేరుపొందింది. తిరుపతి శ్రీకోదండరామాలయంలోని మూలమూర్తులవలెనే తిరుమలలోని ఈ పంచలోహ విగ్రహమూర్తులుకూడా శ్రీరామునకు కుడివైపున సీతాదేవి, ఎడమవైపున లక్ష్మణస్వామి వుండడం ఆశ్చర్యం కలిగిస్తుంది.

ఈ విగ్రహాలతో పాటు రాములవారిమేడలో అరణ్యవాససమయంలో శ్రీరామునికి పరివారంగావున్న సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు మున్నగువారి పంచలోహమూర్తులు కూడా చోటు చేసుకొని వున్నాయి.

ఏది ఏమైనప్పటికీ తిరుమల శ్రీవారి ఆనందనిలయంలో వున్న జటధారులైన శ్రీరామలక్ష్మణుల విగ్రహమూర్తుల ప్రస్తావన క్రీ.శ 1476 లోను, క్రీ.శ 1504 లోని శాసనాల్లో కనపడుతున్నది.

ఇంచుమించుగా ఇదే కాలంలో అనగా క్రీస్తుశకం 1480 లో నరసింహమొదలియార్ అనే రాజు తిరుపతిలోని శ్రీకోదండరామస్వామి ఆలయాన్ని జీర్ణోద్ధరణ చేసినట్లుగా శాసనాధారాలు కనపడుతున్నాయి. ఈ నరసింహమొదలియారే విజయనగర చక్రవర్తి, సాళువ నరసింహరాయలని కొందరి అభిప్రాయం.

ఇంచుమించు ఇదే కాలంలోనే సాళువ నరసింహరాయలు తిరుమల శ్రీవారి ఆలయంలోని సంపెంగప్రదక్షిణంలో తను, తన భార్య, తన ఇద్దరు కుమారులపేర్లతో, నాలుగు మూలల్లో నాలుగు స్తంభాల మండపాలను నిర్మించాడు. కొన్ని ఉత్సవసందర్భాల్లో ఈ మండపాల్లో తిరుమలేశుని వేంచేపుచేయించి నివేదనాదులు జరుగునట్లు కూడ నరసింహరాయలు ఏర్పాట్లు చేశాడు.

అంతేగాక తిరుమల శ్రీవారిఆలయంలోని తిరుమలరాయ మండపం అని పిలువబడే ఎత్తైన సంభాల మండపంలో దక్షిణంవారకు ఎత్తైన శిలా వేదికగల మండపం వుంది. దీన్ని నరసింహరాయలు నిర్మించి దానిలో స్వామివారికి "హంసతూలికపై" ఊంజల్ సేవ జరుగునట్లు ఏర్పటుచేశాడు. అందువల్లే దీన్ని "అణ్ణా ఊయలమండపం" అంటారు. "అణ్ణా' అనగా హంసతూలిక! అని అర్థం.

## జాంబవంత – జనమేజయుల ప్రతిష్ఠ

సీతాన్వేషణసమయంలో రామలక్ష్మణులతో పాటు జాంబవంత, హనుమదాదులు కూడా సంచరించినట్లుగా పురాణ కథనం. ఆ సమయంలో జాంబవంతుడు కొన్నిచోట్ల సాక్షాత్తు పరబ్రహ్మమూర్తి అయిన శ్రీరాముని విగ్రహాలను ప్రతిష్ఠించినట్లు ప్రతీతి! అటు శ్రీరామావతారంతోను, కృష్ణావతారం తోను ప్రత్యక్షంగా అనుబంధం వున్న భక్తాగ్రేసరుడు జాంబవంతుడు.



శ్రీరాముడు నడయాడిన దివ్యప్రదేశంలో జాంబవంతుని వల్ల ప్రతిష్ఠింప బడిన విగ్రహమూర్తులే తిరుపతి పట్టణం నడిబొడ్డున వెలసిన శ్రీ సీతారామలక్ష్మణుల మూర్తులు, అని అనూచానంగా వినవస్తున్న ఐతిహ్యం!

ఆ తర్వాత, కాలాంతరంలో, ద్వాపరయుగాంతంలో జనమేజయచక్రవర్తి ఈ ఆలయాన్ని పునరుద్ధరించి పునఃప్రతిష్ఠించాడని కూడ పెద్దలమాటే కాక, తిరుమల శ్రీవారి ఆలయం "సవాల్ జవాబ్ పట్టీ" అన్న పుస్తకంలో తెలుప బడింది. బ్రిటీష్ కాలంలో "అప్పటి ప్రజలకు, భక్తులకు కొన్ని ప్రశ్నలు వేస్తూ, వాటికి సేకరించిన జవాబులను" క్రోడీకరించిన గ్రంథమే "సవాల్ జవాబ్ పట్టి".

## శ్రీకోదండరామస్వామి ఆలయం

నిరంతరం తిరుమల యాత్రికుల సందడితో అటూ ఇటూ సంచరించే వాహనాల రణగొణ ధ్వనుల మధ్యలో వెలుగొందుతుంటుంది తిరుపతి పట్టణం. ఆ పట్టణం నడిబొడ్డున నిత్యమూ గంభీరమైన ప్రశాంత వాతావరణంతో ఆధ్యాత్మిక చైతన్యంతో విరాజిల్లుతున్న ఆలయం శ్రీకోదండ రామస్వామి ఆలయం.

ఏడు బంగారుకలశాలు మిలమిల మెరుస్తున్న మహాద్వార రాజగోపురంతో పశ్చిమాభిముఖంగా దివ్యమైన ప్రశాంత ధామంగా యాత్రికులకు గోచరిస్తుంటుంది తిరుపతి పట్టణంలోని శ్రీకోదండరామస్వామి ఆలయం.

వైఖానస ఆగమశాస్త్రం ప్రకారం అర్చనలు, ఉత్సవాలు జరుగుతున్న తిరుపతి శ్రీకోదండరామస్వామి ఆలయం అదిగో! ఆలయంలో ప్రవేశిస్తూ అందులోని విషయాలను విశేషాలను తెలుసుకుందాం.

## మహాద్వార రాజగోపురం

మహాద్వార రాజగోపురం సుమారు 10-12 అడుగులు ఎత్తైన రాతి అధిష్ఠానంపై మట్టి ఇటుకలతో మూడు అంతస్థులుగా అనేక శిల్పాలతో నిర్మింపబడివుంది. గోపురంపైన ఏడు బంగారు కలశాలు తళతళమెరుస్తూ ఆలయవైభవాన్ని చాటుతున్నట్లుగా వుంటుంది.

ఈ రాజగోపురం అనుసంధానిస్తూ ఎత్తైన కోట గోడవలె గండశిలలతో నిర్మితమైన దీర్ఘచతురస్రాకార ప్రాకారం మధ్యలో విశాలమైన ప్రాంగణం కనపడుతుంది. ఆ ప్రాంగణం మధ్యలో ఎదురుగా శ్రీకోదండరాముని ప్రధాన ఆలయం నిర్మింపబడింది. ఆలయం ఎదురుగా బంగారు బలిపీఠం, ధ్వజస్తంభం, వాయువ్యమూలలో కల్యాణమండపం, ఆలయంచుట్టూరా ప్రాకారానికి ఆనుకొని చక్కని ఉద్యానవనం, ఆగ్నేయమూలలో వంటశాల, నైరుతిమూలలో అశ్వత్థనారాయణ వృక్షాలతో వున్న వేదిక అలరారుతూ వున్నాయి.

## బలిపీఠం - ధ్వజస్తంభం

రాజగోపుర ద్వారంలో ప్రవేశించిన వెంటనే ఎదురుగా బంగారు బలిపీఠం - దాన్ని ఆనుకొని చాల ఎత్తైన బంగారు ధ్వజస్తంభం కనిపిస్తాయి. బ్రహ్మోత్సవాల సమయంలో ఈ ధ్వజస్తంభంపై గరుడ పతాకం ఎగురవేయ బడుతుంది. ధ్వజస్తంభంపైన ఆలయానికి ఎదురుగా గరుడుని శిల్పం వుండడం, బ్రహ్మోత్సవాల్లో గరుడ పతాకం ఎగురవేయడంలో తిరుపతి శ్రీకోదండరామ స్వామి, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అని నిరూపింపబడి నట్లైనది. ప్రతిరోజూ నివేదన జరిగే వేళల్లో ఈ బలిపీఠంపై భూతగణాలకు సాత్త్విక బలిగా శుద్ధాన్నం (తెల్లని అన్నం) బలిగా సమర్పించబడుతుంది. ఈ ధ్వజస్తంభం బలి పీఠాలకు చుట్టూరా ఇత్తడి కటాంజనం రక్షణగా ఏర్పాటు చేయబడింది.



బంగారు ధ్వజస్తంభం - బంగారు బలిపీఠం

## కల్యాణమండపం

ధ్వజస్తంభ బలిపీఠాలకు ఉత్తరంగా దీర్ఘచతురస్రాకారంగా వున్న శ్రీకోదండరాముని కల్యాణమండపం ఉంది. ప్రతి నెలా పునర్వసు నక్షత్రం నాడు శ్రీసీతాసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవమూర్తులకు కల్యాణోత్సవం జరుగుతుంది. ఆ సాయంత్రం ఆలయంచుట్టూ వున్న తిరుమాడా వీధుల్లో శ్రీసీతాలక్ష్మణ సమేతంగా శ్రీకోదండరామస్వామివారికి పల్లకిపై ఊరేగింపు జరుగుతుంది.

ప్రతి పౌర్ణమినాడు ఈ కల్యాణమండపంలోనే శ్రీసీతాసమేత శ్రీకోదండ రామస్వామి వారలకు, వెన్నముద్ద కృష్ణునికి, చక్రత్తాళ్వార్ అని పిలువబడే సుదర్శన భగవానుని ఉత్సవ మూర్తులకు హోమపూర్వకంగా, అష్టోత్తర శతకలశాభిషేకం జరుగుతుంది. ఆ సాయంత్రం శ్రీకోదండరామ స్వామి వారలకు ఊరేగింపు జరుగుతుంది.

కల్యాణోత్సవంలోను, అష్టోత్తరశతకలశాభిషేకంలోను నిర్ణీత రుసుమును చెల్లించి భక్తులు పాల్గొనవచ్చు.

## వంటశాల

ప్రధాన ఆలయానికి ప్రదక్షిణమార్గంలో ఆగ్నేయమూలన వంటశాల ఉంది. ఇందులో ఆలయంలో జరిగే మూడు పూటల నివేదనలకు అవసరమయ్యే అన్నప్రసాదాలు, అప్పాలు, దోసెలు, సుండలు, పోళీలు, సుఖియలు, సీరా మున్నగు దివ్యప్రసాదాలు తయారు చేయబడతాయి.



## అశ్వత్థ నారాయణ వృక్షం

ఆలయంలో ప్రదక్షిణ మార్గంలో నైరుతి మూలన ప్రాచీనమైన అశ్వత్థనారాయణ వృక్షాలు కలిగిన వేదిక ఉంది. భక్తులు ఇక్కడ దీపజ్యోతులు వెలిగించి ప్రదక్షిణలు చేస్తూంటారు.

## కొలువు మండపం

నైరుతి మూలలోనే అశ్వత్థనారాయణ వృక్షవేదికకు ఆనుకొని నాలుగు కాళ్ల శిలామండపం ఉంది. పూర్వం ఈ మండపంలో ఉదయం 'హరికొలువు' అనే కొలువు మేళం, సాయంసంధ్యలో 'సందెకొలువు' అనే కొలువు మేళాన్ని వాయించే వారు. అందువల్ల ఇది 'కొలువు మండపం' అని పిలువబడుతున్నది.

ఈ కొలువు మండపంపై సిమెంటు కలశంతో గోపురం నిర్మింపబడింది. ఇప్పుడు ఈ మండపంలో కొలువుమేళం జరగడం లేదు.

## ఊంజల్ మండపం

కొలువు మండపానికి తూర్పున 10 అడుగుల దూరంలో నాలుగు కాళ్ల ఎత్తైన శిలామండపం ఉంది. ఈ మండపంపైన బంగారుకలశంతో గోపురం నిర్మింపబడింది. బ్రహ్మోత్సవ సమయాల్లో ప్రతిరోజు సాయంత్రం ఈ మండపంలో ఊంజలసేవ (డోలోత్సవం) జరుగుతుంది. అంతేగాక శ్రీరామనవమి నాడు, మరునాడు దశమిరోజున శ్రీసీతారామ కల్యాణం, శ్రీరామపట్టాభిషేక ఉత్సవాలు ఈ మండపంలో నిర్వహింపబడతాయి.


ఊంజల్ సేవ



## ప్రధాన ఆలయం

ప్రధాన ఆలయంలో ప్రవేశించేముందుగా ప్రధాన ఆలయాన్ని ముఖమండపం, అర్ధమండపం, అంతరాళం, గర్భాలయం అని నాలుగు భాగాలుగా వింగడించి వాటిని గూర్చి తెలుసుకొంటూ ముందుకు సాగుదాం.

## ముఖమండపం

వరుసకు 5 స్తంభాల వంతున 6 వరుసలున్న శిల్పశోభితమైన శిలా స్తంభాలతో నిర్మితమైన ముఖమండపం మధ్య భాగాన ఒక అరుగులాంటి వేదిక నిర్మింపబడింది. ఈ వేదికపై సాధారణ రోజుల్లో స్నపన తిరుమంజనాదులు, ఊంజల్ సేవలు జరుపబడుతుంటాయి. ముఖమండపానికి పడమటి దిక్కున ఇనుప కటాంజనం నిర్మింపబడింది. ఈ ముఖమండపంలోనే శ్రీకోదండ రామస్వామికి ఎదురుగా, గరుడాళ్వారుమండపం ఉంది. శ్రీరామునికి ఎదురుగా గరుడ మండపం ఉండడం ఎక్కడా కనపడదు. ఇచటి రాముడు సాక్షాత్తు విష్ణువని అర్థం. ముఖమండపంలోనే ఈశాన్యమూలన రెండు నైవేద్య ఘంటలు వున్నాయి. నివేదన సమయంలో ఈ ఘంటలు మ్రోగింప బడతాయి. ఈ ముఖమండపంలో గరుడాళ్వారుకు ముందుభాగంలో 'కౌసల్యాసుప్రజారామ...' అంటూ సుప్రభాతం పఠింపబడుతుంది.

## అర్ధమండపం

ముఖమండపాన్ని దాటి లోనికి వెళ్లిన వెంటనే వుండే గది అర్ధమండపం. ఇది గర్భాలయానికి ప్రదక్షిణా మార్గంగా నిర్మింపబడింది. ఈ అర్ధమండపంలో వాకిలికి ఇరువైపులా వున్న రాతి అరల్లో స్వామివారి నగలు, ఆభరణాలు భద్రపరచబడతాయి. ఈ మండపంలోని రెండు స్తంభాలపైన తిరుమల శ్రీనివాసుడు, కంచి వరదరాజు శిల్పాలు ఎదురెదురుగా రమణీయంగా మలచబడినాయి.



## విష్వక్సేనులవారి సన్నిథి

అర్ధమండపంలోనే ఉత్తరం వైపున దక్షిణాభిముఖంగా శ్రీస్వామివారి సైన్యాధికారి విష్వక్సేనులవారి శిలావిగ్రహం వున్న 'అర' ఉంది. 2 అడుగుల శిలా వేదికతో కూడా సుమారు 4 అడుగులు ఎత్తువున్న విష్వక్సేనులవారి ప్రతిమ శంఖచక్రాలను ధరించి, కూర్చున్న భంగిమలో ప్రతిష్ఠించబడింది. శ్రీరాముని సన్నిధిలో శ్రీవేంకటేశ్వరుని సేనాధిపతి విష్వక్సేనుడు వుండడం కూడా విశేషం. ఈ మండపంలోనే విష్వక్సేనులవారి పంచలోహ ఉత్సవమూర్తిని కూడా చూడవచ్చును.

## భాష్యకారులవారి సన్నిథి

ఇదే అర్ధమండపంలోనే దక్షిణంవారకు వున్న రాతిఅరలో (గది) భగవద్రామానుజుల వారి శిలా విగ్రహం ప్రతిష్ఠించబడింది. చిన్ముద్ర ధరించి వున్న రామానుజులవిగ్రహంతోపాటు, నమస్కార భంగిమలో వున్న రామానుజులచిన్న శిలావిగ్రహాన్ని కూడ ఇక్కడ దర్శించవచ్చు. వీటితోపాటు నమ్మాళ్వారుల మరియు రామానుజుల చిన్నపాటి పంచలోహ మూర్తులు కూడ ఇక్కడ దర్శించవచ్చు.

ఈ అర్ధమండపంలో మధ్యభాగాన, సుమారు 4 అడుగుల ఎత్తైన దీర్ఘచతురస్రాకారపు రాతి అధిష్ఠానంపైన అంతరాళం, గర్భాలయం నిర్మింపబడినాయి. మెట్లు ఎక్కి లోన ప్రవేశించే ద్వారానికి ఇరువైపులా కాపలా కాస్తున్న జయవిజయుల నిలువెత్తు శిలావిగ్రహమూర్తులు నయన మనోహరంగా దర్శనమిస్తాయి. ఈ జయ విజయులు రక్షణగా వున్న ద్వారంముందు భాగంలో ప్రతిరోజు తెల్లవారుజామున సుప్రభాత పఠనం జరుగుతుంది.

## అంతరాళం

నాలుగుమెట్లు ఎక్కి ఈ ప్రవేశ ద్వారందాటి లోనికి వెళితే అంతరాళం ఉంది. ఇరుకుగా ఉన్న ఈ అంతరాళం నుండే గర్భాలయంలోని మూలమూర్తులను భక్తులు దర్శిస్తారు. ప్రతిరోజు ఈ అంతరాళంలోనే గొలుసులతో వేలాడదీయబడిన తూగుటుయ్యాలలో వెన్నముద్ద కృష్ణునికి ప్రతిరోజు రాత్రి ఏకాంతసేవ అనగా పవళింపుసేవ జరుపబడుతుంది.



**శ్రీసీతమ్మవారు　　శ్రీకోదండరామస్వామి　　శ్రీలక్ష్మణస్వామి**
**(శ్రీసీతా లక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారు)**
**మూలమూర్తులు**

## గర్భాలయం

అంతరాళం దాటితే లోన ఉండేదే గర్భాలయం. గర్భాలయం మధ్యభాగాన 2 అడుగుల ఎత్తైన శిలా పీఠంపైన స్థానక భంగిమ (నిలుచున్న) లో ప్రతిష్ఠింపబడిన శ్రీ సీతా లక్ష్మణసమేత శ్రీ కోదండరామస్వామివారి నిలువెత్తు శిలావిగ్రహమూర్తులు ప్రతిష్ఠించడినాయి. కొన్ని పంచలోహ మూర్తులు కూడా ఈ గర్భాలయంలో ఉన్నాయి.



## శ్రీకోదండరామస్వామి
### మూలమూర్తులు

మధ్యలో ధనుర్బాణాలను ధరించి నిలిచి వున్న శ్రీరామచంద్రస్వామికి కుడివైపున సీతమ్మవారు, ఎడమవైపున ధనుర్బాణాలు ధరించి నిలిచివున్న లక్ష్మణస్వామివారి శిలావిగ్రహాలు ప్రతిష్ఠించబడినాయి. హనుమంతుని శిలామూర్తి గర్భాలయంలో లేకపోవడం విశేషంగా గమనించవలసిన అంశం.

మూలమూర్తి అయిన శ్రీకోదండరామస్వామి నొసటన తెల్లని ఊర్ధ్వపుండ్రాలు ధరించి, చిన్మయహాసంతో తిరుమల శ్రీనివాస భగవానుని మూలమూర్తిని తలపిస్తుంటాడు. సాక్షాత్తు శ్రీనివాసుడే ధనుర్బాణాలతో ఇలా నిలబడ్డాడా అనిపిస్తుంది.

కుడివైపున సీతాదేవితోను, ఎడమవైపున లక్ష్మణునితో వున్న స్వామిని దర్శిస్తే సకల శ్రేయస్సులు శుభాలు సిద్ధిస్తాయి. ఇష్టార్థాలు నెరవేరతాయని పెద్దలమాట. ఈ కోదండరామస్వామి తిరుమలేశుని మాదిరే వరప్రసాది.

“లోకాభిరాముడైన దశరథరాముడు అందరికి రక్షకుడు. ఆయన కామితఫలదుడు. చరాచరభూతాలన్నిటికి ఆయనే కర్త” అని తెలిసి కొలువరో జనులారా! అని అన్నమయ్య రామవతారవైభవాన్ని అందలివిశేషాలను ఉదాత్తంగా ఈ క్రింది అధ్యాత్మకీర్తనంలో వర్ణించినాడు.

**నాట**

**రాముఁడు లోకాభిరాముఁడందరికి రక్షకుఁడీతనిఁ దెలిసికొలువరో**
**కామితఫలదుఁడు చరాచరములకుఁ గర్తయైన సర్వేశ్వరుఁ డితఁడు**
**॥పల్లవి॥**

**తలఁప దశరథుని తనయుఁడట తానె తారకబ్రహ్మమట!**
**వెలయ మానుషపువేషమట వెగటు హరువిల్లు విరిచెనట!**
**అలరఁగ తానొకరాజట పాదాన నహల్యశాపము మాన్పెనట!**
**సొలవక దైవిక మానుషలీలలు చూపుచు మెరసీఁజూడరో యితఁడు**
**॥రాముఁ॥**

**జగతి వసిష్ఠుని శిష్యుఁడట! జటాయువుకు మోక్షమిచ్చెనట!**
**అగచరులే తనసేనలట! అంబుధి కొండలఁగట్టెనట!**
**మగువకొరకుఁ గానట! కమలాసను మనుమనిరావణుఁ జంపెనట!**
**తగ లౌకికవైదికములు నొక్కట తానొనరించీఁ జూడరో యితఁడు**
**॥రాముఁ॥**

**వెస నమరుల వరమడిగెనట! విభీషణు పట్టము గట్టెనట!**
**యెసగ నయోధ్యకు నేలికట! యింద్రాదులకుఁ గొలువిచ్చెనట!**
**పొసగ శ్రీవేంకటగిరి నివాసమట! భువనము లుదరంబున ధరించెనట!**
**సుసరపు సూక్ష్మాధికములు తనయందుఁ జూపుచున్నాఁడు చూడరో**
**యితఁడు *॥రాముఁడు॥***

తలంచిచూస్తే ఆయన దశరథునికొడుకు మాత్రమే. కాని తాను ముక్తినొసగేతారకబ్రహ్మం. వేసమేమో సామాన్యమనిషి. కాని హరువిల్లు విరిచిన అతిలోక మానిసి. అతనొక రాజు. కాని తన పాదస్పర్శచేత రాతిని నాతిగా (అహల్య) చేసిన మహానుభావుడు. ఇలాగ ఇటు మానుషలీలలు అటు అతిమానుష (దైవిక) లీలలు చూపుతూ ప్రకాశిస్తున్న రాముణ్ని చూడరో అంటూ అన్నమయ్య మొదటిచరణంలో బాల అయోధ్యకాండల్లోని కథవర్ణించినాడు.



జగతిలో వసిష్ఠుని శిష్యుడట. కాని జటాయువునకు ముక్తిప్రదాత. వానరులే తనసేనలట. వారితో సంద్రంలో, కొండలతో వారధిగట్టెనట. మగువమాటకొరకై కానకు వెళ్లినవాడట కాని రావణబ్రహ్మను చంపినవాడట. ఈ విధముగా ఒకవైపు లౌకిక కార్యాలు మరొకవైపు అలౌకికకార్యాలు తానొక్కడే చేస్తున్నవానిని చూడరో; అంటూ అన్నమయ్య ఇందులో ఆరణ్య కిష్కింధ సుందర యుద్ధకాండల్లోని కథను వర్ణించినాడు.

రాక్షస సంహారానికై వానరులుగా పుట్టుమని అమరులను వరమడిగినాడట. కాని విభీషణుణ్ని లంకకు రాజుగాచేసెనట. అయోధ్యకు మాత్రమే రాజట. ఇంద్రాదిదేవతలకుకూడ కొలువిచ్చినవాడట వేంకటాచలమే అతని నివాసమట. కాని అఖిల భువనాలు అతని ఉదరంలోగలవట! ఇలాగ సూక్ష్మాధికములరెండింటిని చూపుతున్న పురుషోత్తముడైన రాముణ్ని దర్శించండి! అని అంటూ అన్నమయ్య ఈ కీర్తనలో రామునిలోకోత్తర విశేషాలను ఉదాత్తాలంకారంలో ఉగ్గడిస్తూ రామకథను పై విధంగా కీర్తించినాడు.

ఈ మూలమూర్తులను జాంబవంతుడు ప్రతిష్ఠించినాడని, అనూచానంగా వినవస్తున్న మాట. శ్రీరాముడనగా సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అని భావించిన జాంబవంతుడు శ్రీరామునికి ఎదురుగా గరుడున్ని మాత్రమే ప్రతిష్ఠించాడు. ఇంతేగాక జాంబవంతునితో తిరిగిన 'హనుమ' సుగ్రీవుని మంత్రిమాత్రమే. అందువల్ల జాంబవంతుని ప్రతిష్ఠలో 'హనుమంతుడు' చోటు చేసుకోలేదని భావించవచ్చు. ఈ ఆలయంలో గరుడునికి ఉన్న ప్రాధాన్యత హనుమంతునికి లేదు.

మూలమూర్తులకు ప్రతిరోజు ఉదయం 5 గంటలకు సుప్రభాతం – తదుపరి విశ్వరూపదర్శనం ఆ తర్వాత తోమాలసేవ, సహస్రనామార్చన,

మొదటి గంట నైవేద్యం – మధ్యాహ్నం అష్టోత్తర శతనామార్చనతో రెండవ నివేదన, సాయంత్రం తోమాలసేవ, అష్టోత్తర శతనామార్చనతో మూడవ నివేదన జరుగుతాయి.

ప్రతి శనివారం ఉదయం మూలమూర్తులకు పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్లు, పసుపు, చందనాదులతో అభిషేకం జరుగుతుంది. ఈ అభిషేక దర్శనాన్ని చూచి తీరవలసిందే తప్ప వర్ణించడానికి సాధ్యం కాదు.

ప్రతి అమావాస్య నాడు శ్రీకోదండరామస్వామి వారి మూలమూర్తులు పూలంగిసేవలో దర్శనమిస్తారు.

## ఉత్సవమూర్తులు

గర్భాలయంలో మూలమూర్తులతో పాటు శ్రీకోదండరామస్వామివారి పంచలోహఉత్సవమూర్తులు, పంచబేరాలు, భక్తాంజనేయస్వామి పంచ లోహమూర్తి, వెన్నముద్ద కృష్ణుని పంచలోహవిగ్రహమూర్తి, సుదర్శన భగవానుని (చక్రత్తాళ్వార్) పంచలోహవిగ్రహమూర్తి చోటుచేసుకున్నాయి.

గర్భాలయాన్ని దాటి తరచుగా శ్రీసీతాలక్ష్మణ సమేత శ్రీకోదండరామ స్వామి ఉత్సవమూర్తులు బ్రహ్మోత్సవాలు, కల్యాణోత్సవం, ఊరేగింపుల్లో పాల్గొంటారు. చక్రత్తాళ్వార్ బ్రహ్మోత్సవంలో చివరిరోజున మాత్రమే బయటకు వచ్చి చక్రస్నానంలో పాల్గొంటారు. ఈ చక్రస్నానం ఆళ్వారుతీర్థం అనబడే కపిలతీర్థంలో నిర్వహిస్తారు. అంతేగాక ప్రతి పున్నమినాడు కల్యాణమండపంలో జరిగే శత కలశాభిషేకంలో కూడ సుదర్శనుడు పాల్గొంటాడు.

శ్రీరామనవమి సందర్భంగా జరిగే పట్టాభిషేకోత్సవంలో పాల్గొనడానికి మాత్రమే ఆంజనేయుని పంచలోహ ప్రతిమ బయటకి తేబడుతుంది.



## శ్రీ భక్తాంజనేయస్వామి

శ్రీకోదండరామస్వామివారి ఆలయానికి ఎదురుగా వున్న వీధిని సన్నిధివీధి అంటారు. ఈ సన్నిధి వీధిలో రాములవారికి అభిముఖంగా అనగా తూర్పుముఖంగా శ్రీభక్తాంజనేయస్వామి ఆలయముంది. ఇందులో హనుమంతుడు నమస్కారభంగిమలో దివ్యదర్శనమిస్తాడు. ఈ స్వామివారికి ప్రతి ఆదివారం ఉదయంపూట పంచామృతంతో అభిషేకం నివేదనలు ఘనంగా జరుగుతాయి. ఆంజనేయస్వామి గర్భాలయంపైన ఏక కలశ గోపురం నిర్మింపబడింది.

**శ్లో॥ హనుమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః**
**రామేష్టః ఫల్గునసఖః పింగాక్షోఽమితవిక్రమః**
**ఉదధిక్రమణ శ్చైవ సీతాశోకవినాశకః**
**లక్ష్మణప్రాణదాతా చ దశగ్రీవస్య దర్పహా।**
**ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః**
**స్వాపకాలే పఠేన్నిత్యం యాత్రాకాలే విశేషతః**
**తస్య మృత్యు భయం నాస్తి సర్వత్ర విజయీభవేత్॥**

ఈ నామాలును పఠిస్తూ ఎందరో భక్తులు ఆంజనేయస్వామికి ప్రదక్షిణలు చేస్తూంటారు. శ్రీఆంజనేయస్వామివారి పై పవిత్రద్వాదశ నామాలను శ్రీవేంకటేశ్వరుని ఆంతరంగికభక్తుడైన అన్నమాచార్యుడు ఒకే పాటలో సంతరించిన తీరు భక్తి ముక్తిదాయకం.



శ్రీ సీతారామస్వామివారి హనుమద్వాహనం



## గౌళ

తలఁచరో జనులు యితని పుణ్యానామములు
సులభముననే సర్వశుభములు గలుగు ॥పల్లవి॥

హనుమంతుఁడు వాయుజుఁ డంజనాతనయుండు
వనధిలంఘన శీలవైభవుఁడు
దనుజాంతకుఁడు సంజీవనీశైలసాధకుఁడు
ఘనుఁడగు కలశాపురహనుమంతుఁడు ॥పల్లవి॥

లంకాసాధకుఁడు లక్ష్మణ ప్రబోధకుఁడు
శంకలేని సుగ్రీవ సచివుఁడు
పొంకపురామునిబంటు భూమిజసంతోషదూత
తెంకినే కలశాపురదేవహనుమంతుఁడు ॥పల్లవి॥

చటులార్జనసఖుఁడు జాతరూపవర్ణుఁడు
ఇటమీఁద బ్రహ్మపట్టమేలేటివాఁడు
నటన శ్రీవేంకటేశునమ్మిన సేవకుఁడు
పటు కలశాపురప్రాంత హనుమంతుఁడు ॥పల్లవి॥

సంజీవనీ శైలసాధకుడైన హనుమంతుని పుణ్యానామాలను నిత్యమూ తలచి ఆయురారోగ్యైశ్వర్యాది సర్వశుభాలను పొందవలసినదని ప్రజానీకాన్ని ప్రబోధించాడు.

వైశాఖ బహుళ దశమి హనుమజ్జయంతినాడు ఆలయంనుండి శ్రీసీతా లక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామి ఉత్సవమూర్తులు ఈ ఆలయానికి వేంచేయగా స్నపన తిరుమంజనాదులు జరుగుతాయి. నివేదనలు జరుగుతాయి.

## పుష్పతోట

ఎదురుగా వున్న భక్తాంజనేయస్వామి గుడికి ఉత్తర దిక్కున 'రాములవారి పుష్పతోట' అని పిలువబడే పుష్పతోట భవనం ఉంది. తిరుపతిలో దేవస్థానం నిర్మించిన తిరుమలయాత్రికుల వసతి భవనం ఇది.

ఒకప్పుడు భవనం మధ్యలో పెద్ద దిగుడు బావి ఉండేది. ఆ బావిచుట్టూరా పుష్పతోట ఒకప్పుడు ఉండేది. తిరుమల యాత్రికుల కోసం దేవస్థానంవారిచే నిర్మింపబడిన ఈ పుష్పతోటలో దేవస్థానంవారు యాత్రికులకు ఉచితంగా మట్టి పొయ్యిలు, వంటపాత్రలు ఇచ్చేవారు. ఇచటి తోటలో చెట్లకింద వంటచేసుకొని భోంచేసి తిరుమలకు వెళ్లేవారు.

చాలఏండ్లకు పూర్వం ప్రతి శనివారం సాయంత్రం ఈ పుష్పతోట మధ్యలో వున్న డోలోత్సవ మండపంలో శ్రీ సీతాలక్ష్మణ సమేత శ్రీకోదండరామ స్వామివారికి డోలోత్సవం జరుపబడేది. చివర్లో పులిహోర, దోసెలు, గుగ్గుళ్లు నివేదన చెయ్యగా, అచ్చటి యాత్రికులకు ఆ ప్రసాదాన్ని పంచేవారు. ఈ పుష్పతోటలోని పుష్పాలు శ్రీరాములవారికి సమర్పించబడుతుండేవి. డోలోత్సవం నిలిచిపోయింది.

ఈ పుష్పతోట దగ్గరినుండి తిరుమలకు భక్తులు నడిచివెళ్లేవారు. నడువలేని వారికి పుష్పతోట దగ్గరే 'డోలీలు' దొరికేవి. పిల్లలు, వృద్ధులు డోలీల్లో కొండకు వెళ్లేవారు. అటు శ్రీకోదండరామస్వామి సేవలోను, తిరుమల యాత్రికుల సేవలోను పాలుపంచుకొన్న 'పుష్పతోట' తి.తి.దేవస్థానం వారి యాత్రిక వసతి విడిది కూడా!

అప్పట్లో తిరుమలకు నడచివెళ్లే వారికి ప్రధానమైన ఏకైక మార్గం ఇదొక్కటే. కనుక ఈ దారిలో వున్న శ్రీకోదండరామస్వామి ఆలయాన్ని యాత్రికులు కొండకు వెళ్లే సమయంలోనో లేదా దిగివచ్చే సమయంలోనే



తప్పక దర్శించేవారు. పుష్పతోటలో విడిది చేసిన యాత్రికులు తప్పక దర్శించే దేవస్థానం కూడా ఈ కోదండరామస్వామి ఆలయం.

కొండకు బస్సులు ఏర్పడడంవల్లా, దేవస్థానం, రైలుస్టేషన్‌కు ఇరువైపులా దగ్గర్లో సత్రాలను నిర్మించడంవల్లా, కపిలతీర్థంమార్గం ప్రాచుర్యంలోనికి రావడంవల్లా, పుష్పతోట విడిది మార్గం మరుగున పడింది. తద్వారా ఈ రామాలయానికి భక్తుల రద్దీ పూర్తిగా తగ్గిపోయింది.

దేవస్థానంవారి ఆలయం దర్శనం బస్సులవల్లా, ఇటీవల నిర్వహిస్తున్న ఉత్సవాల వల్లా ఇప్పుడిప్పుడే కోదండరామాలయానికి భక్తుల సందడి మళ్లా పెరిగిందని చెప్పవచ్చు.

ఇలాగ శ్రీకోదండరామస్వామిఆలయం మళ్లీ ఇటీవలి కాలంలో పూర్వవైభవాన్ని సంతరించుకుంటూ, భక్తుల సందడితో కోలాహలంగా ఉంటోంది.

## ఉత్సవ వైభవం

తిరుపతి శ్రీకోదండరామస్వామి వారికి ఏడాది పొడవునా వైభవంగా ఉత్సవాలు వైఖానస ఆగమశాస్త్రం ప్రకారం జరుగుతుంటాయి. సేవలు నిర్వహింప బడుతూనే వుంటాయి. ఈ ఆలయంలో జరిగే ఉత్సవాలను (1) నిత్యోత్సవాలు (2) వారోత్సవాలు (3) మాసోత్సవాలు (4) సంవత్సరోత్సవాలు అని 4 రకాలుగా విభజించి పరిశీలించుదాం.

## నిత్యోత్సవాలు

ప్రతిరోజు విధిగా జరుపబడే సేవలను, ఉత్సవాలను నిత్యోత్సవాలు అని అంటారు.

**1.సుప్రభాతం**

ప్రతిరోజు తెల్లవారుజామున అంతరాళంముందు జయవిజయులు కాపలావున్న ద్వారం ముందుభాగంలో 5 గంటలకు "కౌసల్యా సుప్రజారామ" అంటూ సుప్రభాతాన్ని పఠిస్తూ శ్రీస్వామివారిని మేల్కొల్పే సేవ ఇది. పవళింపులో ప్రతిరోజు వెన్నముద్ద కృష్ణుడు శయనంపై వేంచేసివుంటాడు. ఒక్క ధనుర్మాసనంలో సుప్రభాత పఠనం ఉండదు. నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు మాత్రమే సుప్రభాత సేవలో పాల్గొనవచ్చు.

ఈ ఆలయంలో తిరుమలలో పఠించే శ్రీవారి సుప్రభాతాన్ని గానం చెయ్యడం విశేషం. అంటే సాక్షాత్తు తిరుమల శ్రీవేంకటేశ్వరుడే శ్రీకోదండ రాముడన్న అభేదం స్ఫురిస్తుంది.

**2. విశ్వరూప దర్శనం**

సుప్రభాతసేవ అయిన వెంటనే ఉదయం 8 గంటలకు శ్రీస్వామివారి మూలమూర్తుల మీద ఎలాంటి పూలమాలలు లేకుండా విశ్వరూప దర్శనం చేసుకోవచ్చు.

**3. తోమాలసేవ**

మూలమూర్తులకు, ఉత్సవ మూర్తులకు పుష్పాలంకరణ సేవ ఏకాంతంగా జరుగుతుంది. ఈ పుష్పాలంకరణను దర్శించే వీలులేదు.

**4. సహస్రనామార్చన**

ప్రతిరోజు ఉదయం 8.30 గంటలకు శ్రీరామసహస్ర నామావళితో శ్రీకోదండ రామస్వామివారికి తులసితో సహస్రనామార్చన జరుగుతుంది. నిర్ణీత రుసుమును చెల్లించి భక్తులు ఈ సేవలో పాల్గొని దర్శించవచ్చు.



**5. అర్చనానంతర దర్శనం**

ప్రతిరోజు ఉదయం 9.30 గంటలకు జరుపబడే అర్చనానంతర దర్శనంలో నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు మాత్రమే పాల్గొని శ్రీకోదండరాముని మూలమూర్తులను దర్శించ వచ్చు.

**6. మొదటి గంట నివేదన**

ఘంటానాదంతో నివేదనను ఏకాంతంగా నిర్వహిస్తారు. ఉదయం పూట మొదటి గంటకు జరిగే నివేదనలో దధ్యోదనం మాత్రమే అనగా 'పెరుగన్నం' నివేదన చెయ్యబడుతుంది.

**7. మధ్యాహ్న గంట నివేదన**

ప్రతిరోజు 12 గంటలకు మాధ్యాహ్నిక ఆరాధనలో శ్రీరామ అష్టోత్తర శతనామార్చన, నివేదన ఏకాంతంగా జరుగుతాయి. ఘంటానాదంతో చక్కెర పొంగలి - పులిహోరలు మధ్యాహ్నం నివేదింపబడతాయి.

**8. సాయంత్రం ఆరాధన - నివేదన**

ప్రతిరోజు సాయంత్రం 6 గం॥ - 7 గం॥ల వరకు తోమాలసేవ, అష్టోత్తర శతనామార్చన, నివేదనలు ఏకాంతంగా జరుగుతాయి. ఈ ఆరాధనలో "మొళహోర" అనబడే "మిరియపు పొంగలి" నివేదింప బడుతుంది.

**9. ఏకాంతసేవ**

ప్రతిరోజు రాత్రి 8 1/2 గంటలకు ఏకాంతసేవ జరుగుతుంది. పవళింపుసేవను ఏకాంతసేవ అంటారు. ప్రతిరోజు పవళింపులో తూగు టుయ్యాలలో వెన్నముద్ద కృష్ణుని శయనింపజేస్తారు.

ఈ సమయంలో చిన్నికృష్ణునికి జీడిపప్పు, ఎండుద్రాక్ష, బాదంపప్పు, చక్కెర, అరటిపండ్లు, గోరువెచ్చని ఆవుపాలు – నివేదింపబడతాయి.

నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు ఏకాంతసేవలో పాల్గొని దర్శించవచ్చు.

## వారోత్సవాలు

వారానికి ఒకసారి నిర్ణీతరోజున జరుపబడే ఉత్సవాలను వారోత్సవాలు అంటారు. అభిషేకం, అభిషేకానంతర దర్శనం, ఊంజల్‌సేవ వారోత్సవాలు

### 1. అభిషేకం

ప్రతి శనివారం ఉదయం 8 గంటలకు శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి మూలమూర్తులకు పాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్లు, చందనం, పసుపు మున్నగు ద్రవ్యాలతో అభిషేకం శోభాయమానంగా జరుపబడుతుంది. నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు అభిషేకసేవలో పాల్గొని దర్శించవచ్చు.

### 2. అభిషేకానంతర దర్శనం

ప్రతి శనివారం అభిషేకం అయిన వెంటనే నిర్ణీత రుసుమును చెల్లించి భక్తులు మూలమూర్తులను ఆపాదమస్తకం దర్శనం చేయవచ్చును. ఈ దర్శనం అద్భుతం! ఆనందదాయకం!

### 3. ఊంజల్‌సేవ

ప్రతి శనివారం సాయంత్రం 6 గంటలకు శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవమూర్తులకు తిరుమాడా వీధులలో ఊరేగింపు జరుగుతుంది.



శ్రీ సీతారామస్వామివారి కల్యాణోత్సవ దృశ్యం

ఊరేగింపునకు వెళ్లివచ్చిన తర్వాత ఈ ఉత్సవమూర్తులకు ఆలయంలో ఊంజల్‌సేవ జరుపబడుతుంది. నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు ఊంజల్‌సేవలో పాల్గొనవచ్చు.

## మాసోత్సవాలు

నెలకు ఒక్కమారు నిర్ణీత రోజున లేదా నిర్ణీత నక్షత్రం రోజున జరుపబడే ఉత్సవాలు ఇవి.

### 1. కల్యాణోత్సవం

శ్రీరాముని జన్మనక్షత్రం పునర్వసు రోజున ఆలయం ప్రాంగణంలో వున్న కల్యాణమండపంలో శ్రీసీతాసమేత కోదండరామస్వామి వారలకు కల్యాణోత్సవం జరుపబడుతుంది. శ్రీసీతారాములకు జరిగే ఈ కల్యాణోత్సవంలో నిర్ణీత రుసుమును చెల్లించి గృహస్థులు పాల్గొని దర్శించవచ్చు.

కల్యాణోత్సవంలో అప్పం, చక్కె పొంగలి, పొంగలి, వడపప్పు, పానకం నివేదింపబడుతాయి.

ఆ సాయంత్రం పురవీధుల్లో శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామ స్వామికి ఊరేగింపు జరుగుతుంది. అనంతరం ఆస్థానం జరుగుతుంది.

### 2. శతకలశాభిషేకం

ప్రతినెలా పూర్ణిమనాడు, ఆలయ ప్రాంగణంలోని కల్యాణమండపంలో హోమపూర్వక అష్టోత్తర శతకలశాభిషేకం జరుపబడుతుంది. ప్రతి పున్నమినాడు హోమం జరిగిన తర్వాత జరుపబడే ఈ అష్టోత్తర శత



కలశాభిషేకంలో శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవ మూర్తులతో పాటు, వెన్నముద్ద కృష్ణుడు మరియు సుదర్శన చక్రత్తాళ్వార్ పంచలోహమూర్తులకు ఈ అభిషేకం జరుపబడుతుంది. నిర్ణీత రుసుమును చెల్లించిన గృహస్థులు పున్నమినాడు జరిగే శతకలశాభిషేకంలో పాల్గొనవచ్చు.

ఆ సాయంత్రం శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారికి మాత్రమే ఊరేగింపు జరుపబడుతుంది.

### 3. రామచంద్రపుష్కరిణి ఉద్యానవన ఉత్సవం

ప్రతి పున్నమినాటి సాయంత్రం శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామ స్వామివారి ఉత్సవమూర్తులకు పల్లకిలో ఊరేగింపు జరుగుతుంది. ఆలయానికి ఎదురుగా వున్న రామచంద్రపుష్కరిణి కట్టకు వెళ్లి అక్కడి ఉద్యానవనంలో వేంచేపు చేయగా ఆస్థానం జరుగుతుంది. తర్వాత ఆలయానికి ఊరేగింపుగా విచ్చేస్తారు.

### 4. పూలంగిసేవ

ప్రతినెలా అమావాస్యనాటి ఉదయం 8 గం॥ల నుండి రాత్రి వరకు గర్భాలయంలోని మూలమూర్తులను పూలంగిసేవలో దర్శనం చేసుకోవచ్చు.. అనగా నిలువెత్తు మూర్తులకు పూలమాలలు అలంకరింపబడే సేవ. ఇది అమావాస్య నాటి పగలంతా భక్తులు ఉచితంగా దర్శించవచ్చు.

## వార్షికోత్సవాలు

సంవత్సరానికి ఒకమారు నిర్ణీత రోజుల్లో జరిగే ఉత్సవాలను వార్షికోత్సవాలని, సంవత్సరోత్సవాలని అంటారు.

**1. కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం**

దేవాలయాన్ని పూర్తిగా శుద్ధి చేయడమనే కార్యక్రమాన్ని కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం అంటారు.

ఆళ్వార్ అనగా భగవంతుని తన హృదయంలో ప్రతిష్ఠించుకొన్న భక్తుడు అని అర్థం. కోయిల్ అనగా ఆలయం. కోయిల్ హృదయం అనగా గర్భాలయంలో దేవుడు వుంటాడు కనుక భక్తునితో పోల్చబడి "కోయిల్ ఆళ్వార్" అని చెప్పబడింది.

ఈ కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం సంవత్సరంలో దీపావళికి ముందుగాను, బ్రహ్మోత్సవాలకు ముందుగాను ఇలా సంవత్సరంలో రెండుమార్లు నిర్వహింపబడుతుంది. కర్పూరం, నామంకొమ్ము ఖిచిలిగడ్డ కలిపిన చూర్ణాన్ని ఆలయంలో పూస్తారు.

**2. బ్రహ్మోత్సవాలు**

ప్రతి ఏటా పాల్గుణమాసంలో మృగశిరనక్షత్రంనాటికి పూర్తి అయ్యేట్లుగా 9 రోజుల ముందు నుంచి శ్రీకోదండరామస్వామికి బ్రహ్మోత్సవాలు ప్రారంభమవుతాయి.

ముందునాటి సాయంత్రం బ్రహ్మోత్సవాలకు అంకురార్పణం జరుగుతుంది. మొదటిరోజున ఉదయం బ్రహ్మోత్సవాలను ప్రారంభిస్తూ ధ్వజస్తంభంపై 'గరుడ కేతనం' ఎగురవేస్తారు. ఆ రోజు రాత్రి పెదశేషవాహనం, రెండవ రోజు ఉదయం చిన్నశేషవాహనం, ఆ రాత్రి హంసవాహనం, మూడవరోజు ఉదయం సింహవాహనం, ఆ రాత్రి ముత్యపుపందిరివాహనం, నాల్గవ రోజు ఉదయం కల్పవృక్షవాహనం, ఆ రాత్రి సర్వభూపాల వాహనం, ఐదవరోజు పల్లకిఉత్సవం, ఆ రాత్రి గరుడోత్సవం, ఆరవనాడు ఉదయం



శ్రీ సీతారామస్వామివారి పల్లకి ఉత్సవం



శ్రీ కోదండరామస్వామివారి చినశేషవాహనం



శ్రీకోదండరామస్వామివారి గరుడోత్సవం




శ్రీకోదండరామస్వామివారి కల్పవృక్షవాహనం



హనుమంత వాహనం, ఆ రాత్రి గజవాహనం, ఏడవనాటి ఉదయం సూర్యప్రభ, ఆ రాత్రి చంద్రప్రభ, ఎనిమిదవరోజు ఉదయం రథోత్సవం, ఆ రాత్రి అశ్వవాహనం, తొమ్మిదవరోజు ఉదయం చక్రస్నానం, ఆ రోజు ధ్వజ అవరోహణం జరుగుతాయి. ఆ తర్వాత ప్రతిరోజురాత్రి ఉదయం శ్రీ కోదండ రామస్వామివారికి వాహనోత్సవాలు వైభవంగా జరుగుతవి. ప్రతిపూటా జరిగే ఈ ఉత్సవంలో నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు కూడ పాల్గొనవచ్చు. చివరిరోజున అనగా మృగశిర నక్షత్రం నాటి ఉదయం పూట శ్రీసీతాలక్ష్మణ సమేత శ్రీకోదండరామస్వామివారితో పాటు శ్రీ సుదర్శన చక్రత్తాళ్వార్ మరొక పల్లకిపై వేంచేసి ఊరేగింపుగా ఆళ్వార్ తీర్థానికి (కపిలతీర్థం) వెళతారు. అక్కడ స్నపన తిరుమంజనం అయిన తర్వాత పుష్కరిణిలో చక్రత్తాళ్వారు స్నానం జరుపబడుతుంది.

**3. ద్వాదశారాధన**

బ్రహ్మోత్సవాలు పూర్తి అయిన మరునాడు శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవమూర్తులకు ఘనంగా స్నపన తిరుమంజనం జరుగుతుంది. పిదప పంద్రెండు మార్లు నివేదనలు జరుగుతాయి. బ్రహ్మోత్సవాల్లో బాగా అలసిపోయిన స్వామివారు ఈ ఉత్సవంలో సేదదీరి విశ్రాంతి తీసుకొంటారు. ఈరోజు ఎలాంటి అలంకరణలు వుండవు. ఊరేగింపులు జరుగవు.

**4. రేపాకుల సుబ్బమ్మతోట ఉత్సవం (ఆర్.ఎస్. గార్డెన్)**

సుమారు 100 ఏండ్లకు ముందు రేపాకుల సుబ్బమ్మ అనే భక్తురాలు శ్రీకోదండరామస్వామి వారికి, ఇప్పటి బాలమందిరం, ఓరియంటల్ కాలేజి, శ్రీగోవిందరాజస్వామిహైస్కూలు వ్యాపించిన తోటస్థలాన్ని విరాళంగా సమర్పించింది. అందుకు అనుగ్రహంగా బ్రహ్మోత్సవానంతరం రేపాకుల

సుబ్బమ్మగారి తోటలో వుండే మండపానికి ఉదయం శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామి ఊరేగింపుగా వస్తారు. అక్కడ స్నపన తిరుమంజనం అయిన తర్వాత ఘనంగా నివేదనలు జరుగుతాయి. ఆ సాయంత్రం స్వామివారు ఆలయానికి ఊరేగింపుగా వస్తారు. దేవస్థానం అర్చకస్వాములు సుబ్బమ్మ వంశీయులకు తాంబూల ప్రసాద వితరణ చేస్తారు.

**5. కనిజతోట ఉత్సవం**

రేపాకుల సుబ్బమ్మతోట ఉత్సవం జరిగిన మరునాడే శ్రీకోదండరామ స్వామివారికి కనిజతోట ఉత్సవం జరుగుతుంది.

పూర్వం గోవిందరాజస్వామివారి ఆలయం వెనుక వుండే పాతహుజూర్ ఆఫీసులో వుండే దిగుడు బావిలో శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామి వారు సేద దీరునట్లుగా స్నపన తిరుమంజనం జరిగేది. ఆ తర్వాత గోవిందరాజస్వామి ఆలయం చుట్టూ ఊరేగింపుగా ఆలయానికి వేంచేసే వారు. ఇప్పుడు ఆ బావిలో నీళ్లు లేనందువల్ల ఆలయంలోనే స్నపన తిరుమంజనం పూర్తి చేసుకొని ఆ సాయంత్రం గోవిందరాజస్వామివారి ఆలయ ప్రదక్షిణంగా ఊరేగింపు జరిగిన తర్వాత శ్రీకోదండరామస్వామి ఆలయం చేరుకొంటారు.

**6. ఆస్థానాలు**

ఉగాది పండుగనాడు, దీపావళి పండుగనాడు, కార్తీక పౌర్ణమినాడు, ఆలయ ముఖమండపంలోని శిలా వేదికపైన శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారికి ఆస్థానాలు జరుగుతవి.

ఉగాదినాడు పంచాంగ శ్రవణం, దీపావళినాడు నరకాసురవధ, కార్తికపున్నమినాడు కార్తికపురాణం విన్పించబడతవి.



**7. తెప్పోత్సవాలు**

ప్రతి సంవత్సరం చైత్రమాసం పున్నమికి పూర్తి అయ్యేట్లుగా ఆలయానికి ఎదురుగా వున్న శ్రీరామచంద్రపుష్కరిణిలో మూడు రోజుల పాటు సాయంత్రం వేళ తెప్పోత్సవాలు జరుగుతాయి. ఈ తెప్పోత్సవాలు శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవమూర్తులకు మాత్రమే నిర్వహింపబడతుంది.

మాఘపున్నమికి పూర్తి అయ్యేట్లుగా శ్రీగోవిందరాజస్వామివారి పుష్కరిణిలో 5 రోజులపాటు తెప్పోత్సవాలు జరుగుతాయి. అందులో మొదటి రోజున ఈ ఆలయం నుండి ఊరేగింపుగా వెళ్లిన శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవమూర్తులకు తెప్పోత్సవం జరుగుతుంది.

1926 లో నిర్మితమైన గోవిందరాజపుష్కరిణి కంటె పూర్వం – తిరుచానూరులోని పద్మసరస్సులో జరిగే తెప్పోత్సవాల్లో, తిరుపతి గోవిందరాజస్వామి, తిరుపతి శ్రీకోదండరామస్వామి పాల్గొనేవారని తెలియపరుస్తున్నది.

**8. హనుమజ్జయంతి**

ప్రతి సంవత్సరం వైశాఖ బహుళ దశమినాడు హనుమజ్జయంతి. ఆనాడు శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారి ఉత్సవమూర్తులు ఆలయ ఎదురుగా ఉన్న ఆంజనేయస్వామి ఆలయానికి పల్లకిలో ఊరేగింపుగా వేంచేయబడతాయి. అక్కడ స్నపన తిరుమంజనాలు, నివేదనలు అయింతర్వాత ఆ సాయంత్రం ఈ మూర్తులు ఊరేగింపుగా ఆలయం చేరుకొంటాయి.

### 9. పవిత్రోత్సవం

ప్రతి సంవత్సరం ఆషాఢ బహుళ త్రయోదశికి పూర్తి అగునట్లుగా 3 రోజులపాటు పవిత్రోత్సవాలు జరుగుతవి.

ఆలయంలో తెలిసీ, తెలియక జరిగే పొరపాట్ల వల్ల, దోషాల వల్ల ఆలయపవిత్రత తగ్గకుండా ఉండేందుకు చేసే ఉత్సవాలు ఇవి.

మొదటిరోజు పవిత్రప్రతిష్ఠ, రెండవరోజు పవిత్ర సమర్పణ, మూడవరోజున పూర్ణాహుతి ఉత్సవాలు నిర్వహింపబడతాయి.

నిర్ణీత రుసుమును చెల్లించిన భక్తులు ఈ సేవలో పాల్గొనవచ్చు.

### 10. ధనుర్మాసం

ప్రతిసంవత్సరం డిశంబరు 15 నుండి జనవరి 14 వరకు ధనుర్మాసంలో నెల రోజులపాటు సుప్రభాతం వుండదు. తెల్లవారుజామున 4 గంటలకు పొంగళ్లు నివేదింపబడతాయి. ధనుర్మాసంలోనే వైకుంఠ ఏకాదశి పూజలు జరుగుతవి.

### 11. కూపు రామచంద్రపేట ఉత్సవం

ప్రతి సంవత్సరం మాఘపౌర్ణమినాటి ఉదయం శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామివారు ఊరేగింపుగా బయలుదేరి తిరుపతికి దక్షిణంగా ఉన్న కూపురామచంంద్రపేట దగ్గర సువర్ణముఖరీ నదీతీరానికి వేంచేస్తారు. అక్కడ సువర్ణముఖీనదీ జలాలతో స్నపన తిరుమంజనం, నివేదనలు అయిన తర్వాత ఆ సాయంత్రం ఊరేగింపుగా ఆలయం చేరుకొంటారు.



శ్రీ సీతారామస్వామివారి రథోత్సవం

## సమర్పణ



**కౌసల్యా సుప్రజారామ! పూర్వాసంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్**

అంటూ ప్రతినిత్యం తిరుమల కొండపైన శ్రీవేంకటేశ్వరునిగా, కొండక్రింద శ్రీకోదండరామునిగా మేలుకొలుపులు పాడించుకొంటూ

**"యోఽసి సోఽసి"**

**"ఎవడై వున్నాడో అతడే వాడు"** గా భాసిస్తున్న

పరబ్రహ్మకు
ఈ పుస్తక సుమం
సమర్పణం

ఓం నమో వేంకటేశాయ

* * *

## శ్రీరామచంద్రుడు ఎవరు!

**శ్లో॥ బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ**
**త్వమేవ రఘునందనః** - పద్మపురాణం

శ్రీరామమూర్తి సాక్షాత్తు బ్రహ్మవిష్ణు శివస్వరూపుడైన త్రిమూర్త్యాత్మకుడు! అని పద్మపురాణం స్పష్టం చేస్తోంది.

* * *

**శ్లో॥ బ్రహ్మ విష్ణు శివరూపతోఽఖిలం**
**హంతి పాతి సృజతి ప్రభుః**
**రామ ఏవ ద్విజవర్య తతోఽన్య**
**న్నాస్తి నాస్తి పరమం ఖలు దైవతమ్** - బ్రహ్మాండపురాణం

బ్రహ్మ విష్ణు శివస్వరూపాలతో సృష్టి స్థితి లయాలను చేస్తున్న సాక్షాత్తు పరబ్రహ్మమూర్తి శ్రీరామచంద్రుడు!

ఆయనకు మించిన దైవం లేదు. అని పద్మపురాణం పేర్కొంటున్నది.

* * *

**శ్లో॥ అహం దాశరథీ రామో**
**భూత్వా వై దండకాననే**
**రాక్షసాన్నిఖిలాన్ దుష్టాన్**
**హత్వా వై దండకాననే** - పద్మపురాణం-కవేరజాఖండం

ఒకానొకప్పుడు పరమశివుడు తన దగ్గరికి శరణ కోరుతూ వచ్చిన ఋషులతో ఇలా అంటాడు. "నేను దశరథుని పుత్రుడైన శ్రీరామునిగా అవతరించి దండకారణ్యంలోని దుష్టులైన రాక్షసులను అందర్నీ సంహరిస్తాను" – ఈ విషయం పద్మపురాణంలోని కవేరజాఖండంలో పేర్కొనబడింది.

* * *

**శ్లో॥ త్వం విష్ణుం జానకీ లక్ష్మీః శివస్త్వం జానకీ శివా**
**బ్రహ్మాత్వం జానకీ వాణీ సూర్యస్త్వం జానకీ ప్రభా**
**రుద్రాణీ జానకీ ప్రోక్తా రుద్రస్త్వం లోక నాశకృత్**

– బ్రహ్మాండ పురాణాంతర్గత అధ్యాత్మరామాయణం.

నువ్వే విష్ణువు. సీతే లక్ష్మి! నువ్వే శివుడవు సీతే పార్వతి! నువ్వే బ్రహ్మవి సీతే వాణి. నువ్వు సూర్యుడివి. సీతే ప్రభ! నువ్వే లోకనాశకుడైన రుద్రుడివి! సీతే రుద్రాణి! – అంటూ నారదమహర్షి శ్రీరామచంద్రునితో వివరించినట్లు అధ్మాత్మరామాయణం పేర్కొంటోంది.

* * *

**శ్లో॥ తస్యాం దశరథాద్రాజ్ఞః దశగ్రీవ వధార్థభిః**
**బ్రహ్మద్వై రర్థితో విష్ణురీశాంశే నావతీర్ణవాన్**

– *గరుడపురాణం*

శ్రీమహావిష్ణువు ఈశ్వరాంశను కలుపుకొని శ్రీరామునిగా అవతరించినట్లు గరుడపురాణంలో కూడా చెప్పబడింది.

* * *



**శ్లో॥ శివం మాం ప్రతిజానీధ నాఽవయోరంతరం ద్విజాః**
**ఆవయోరంతరం జ్ఞానం తదేవాఽజ్ఞాన మిష్యత్**

– *దుర్వాసరామాయణ:*

శ్రీరామచంద్రుడు తన దగ్గరికి వచ్చిన ఋషులతో ఇలా అంటాడు, "ఓ యోగులారా! నన్నే శివునిగా తెలుసుకోండి. నాకూ శివునికీ మధ్య అంతరం ఏమాత్రం లేదు. మా ఇద్దరిమధ్య అంతరం ఉందని భావిస్తే అది మీ అజ్ఞానం అవుతుంది" అని దుర్వాసరామాయణంలో ఉట్టంకింపబడింది.

* * *

**శ్లో॥ రామ ఏవ హరో జ్ఞేయ శ్శివ ఏవ రఘూత్తమః**
**ఉభయోర్నాంతరం జ్ఞేయం భేదకృన్నారకీ నరః**

– *ఆనందరామాయణం*

రాముడే శివుడని తెలుసుకోండి! ఆ శివుడే రఘూత్తముడు! ఈ ఇద్దరిమధ్య అంతరం వుందన్న భేదబుద్ధి కల్గిన నరులకు నరకలోకం తప్పక కలుగుతుంది – అని ఆనందరామాయణంలో చెప్పబడింది.

* * *

**శ్లో॥ రామం త్రినేత్రం సోమార్థధారిణం శూలినం పరమ్**
**భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దినముపాస్మహే ॥**

– రామరహస్యోపనిషత్తు

ఒకానొకప్పుడు ఆంజనేయుడు శ్రీరాముని శివునిగా దర్శించి ఇలా ప్రార్థించాడు. మూడు కన్నులు కలవానిగా ఉమతో కలిసిన అర్ధనారీశ్వరునిగా, త్రిశూలాన్ని ధరించినవానిగా శరీరమంతా భస్మాన్ని పూసుకొన్న సాక్షాత్ శివునిగా దర్శిస్తూ ప్రార్థించాడని రామరహస్యోపనిషత్తు తెలుపుతోంది.

**శ్లో॥ భవాన్ నారాయణో దేవః**
**శ్రీమాన్ చక్రాయుధో విభుః**
**వధార్థం రావణస్యేహ**
**ప్రతిష్ఠో మానుషీం తనుమ్**

– *శ్రీమద్రామాయణం–యుద్ధకాండ*

సీతాదేవి అగ్ని ప్రవేశం సందర్భంలో బ్రహ్మదేవుడు శ్రీరామునితో ఇలా అంటాడు "శ్రీరామచంద్రా! సుదర్శన చక్రాయుధ ధారివైన శ్రీమహావిష్ణువే నీవు. కేవలం రావణుని చంపడం కోసమే మానవునిగా అవతరించావు" అని శ్రీమద్రామాయణ మహాకావ్యంలో తెల్పబడింది.

ఇలాగ అనేక పురాణగ్రంథాలు వివిధ దేవతాస్వరూపునిగా సాక్షాత్ పరబ్రహ్మగా శ్రీరాముణ్ణి వర్ణించాయి.

ఈ శ్లోకాలన్నీ బ్రహ్మశ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి (విశాఖపట్టణం) గారి "రామాయణ ప్రసంగ లహరి" గ్రంథం నుండి స్వీకరించబడినవి. వారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

* * *

# శ్రీరామాష్టోత్తర శతనామ స్తోత్రమ్

శ్రీరామో రామభద్రశ్చ రామచంద్రశ్చ శాశ్వతః ।
రాజీవలోచన శ్శ్రీమాన్ రాజేంద్రో రఘుపుంగవః ॥

జానకీవల్లభో జైత్రో జితామిత్రో జనార్ధనః ।
విశ్వామిత్రప్రియో దాంతశ్శరణత్రాణతత్పరః ॥

వాలిప్రమథనో వాగ్మీ సత్యవాక్సత్యవిక్రమః ।
సత్యవ్రతో వ్రతధర స్సదా హనుమదాశ్రితః ॥

కౌసలేయః ఖరధ్వంసీ విరాధవధపండితః ।
విభీషణపరిత్రాతా హరకోదండఖండనః ॥

సప్తసాల ప్రభేత్తా చ దశగ్రీవశిరోహరః ।
జామదగ్న్యమహాదర్పదళనస్తాటకాన్తకః ॥

వేదాంతసారో వేదాత్మా భవరోగస్య భేషజమ్ ।
దూషణత్రిశిరోహన్తా త్రిమూర్తి స్త్రిగుణాత్మకః ॥

త్రివిక్రమ స్త్రిలోకాత్మా పుణ్యచారిత్ర కీర్తనః ।
త్రిలోకరక్షకో ధన్వీ దండకారణ్యవర్తనః ॥

అహల్యాశాపశమనః పితృభక్తో వరప్రదః ।
జితేంద్రియో జితక్రోధో జగన్మిత్రో జగద్గురుః ॥

ఋక్షవానర సంఘాతీ చిత్రకూటసమాశ్రయః ।
జయంతత్రాణవరదః సుమిత్రాపుత్రసేవితః ॥

సర్వదేవాది దేవశ్చ మృతవానర జీవనః ।
మాయామారీచహంతా చ మహాదేవో మహాభుజః ॥

సర్వదేవస్తుతస్సౌమ్యో బ్రహ్మణ్యో మునిసంస్తుతః ।
మహాయోగీ మహోదారః సుగ్రీవేప్సితరాజ్యదః ॥

సర్వపుణ్యాధిక ఫలః స్మృతసర్వఘనాశనః ।
ఆదిపురుషః పరమపురుషో మహాపూరుష ఏవ చ ॥

పుణ్యోదయో దయాసారః పురాణపురుషోత్తమః ।
స్మితవక్త్రో మితభాషీ పూర్వభాషీ చ రాఘవః ॥

అనంతగుణగంభీరో ధీరోదాత్త గుణోత్తమః ।
మాయామానుషచారిత్రో మహాదేవాదిపూజితః ॥

సేతుకృజ్జితవారాశిః సర్వతీర్థమయో హరిః ।
శ్యామాంగ సుందర శ్శూరః పీతవాసా ధనుర్ధరః ॥

సర్వయజ్ఞాధిపో యజ్వా జరామరణవర్జితః ।
పరమాత్మా పరంబ్రహ్మ సచ్చిదానంద విగ్రహః ॥

పరంజ్యోతిః పరంధామ పరాకాశః పరాత్పరః ।
పరేశః పారగః పారః సర్వదేవాత్మకః పరః ॥

*(ఇతి శ్రీరామాష్టోత్తర శతనామస్తోత్రమ్)*